# రచనాస్వాదనం

(పాతికేళ్ళ రచనానుభవాలు - జ్ఞాపకాలు)

1969 - 94

డా. ఆర్వీయస్. సుందరం
తెలుగుశాఖ, మైసూరు విశ్వవిద్యాలయం
మానసగంగోత్రి, మైసూరు - 570 006



ప్రతులకు:
చింతల పద్మావతి హోం లైబ్రరీ
76 - 5 - 16, గాంధీపురం - 2,
రాజమండ్రి - 533 103.

# RACHANASWADANAM (Pleasure of Writing)

Sauseelya Books - 1

**Dr. R.V.S. Sundaram,**
M - 929, Vivekananda Nagar,
Mysore - 570 023.

**First Edition, 1994**



**Price: Rs. 20=00**

Cover Design by: Buddha Satyanarayana, RJY.
Composed by: Padmavathi Typesetters, RJY.
Printed at: Uma Offest Printers, RJY.

**FOR COPIES:**

**Chintala Padmavathi Home Library**
76 - 5 - 16, Gandhipuram - 2,
RAJAHMUNDRY - 533 103.

ఇది

నాకు అత్యంతాప్తులు

కోస్తావాణి సంపాదకులు అయిన

శ్రీ చింతల గోపాలరావుగారి అమ్మాయి

## చి॥ పద్మప్రియ

వివాహ సందర్భంగా (25-5-94)

పుస్తకాకృతి దాల్చిన బహూకృతి





## రచయిత గురించి

పుట్టింది : నెల్లూరు, 21 - 4 - 1948

చదువు : జంతుశాస్త్రంలో బి.ఎస్.సి
తెలుగు కన్నడ సంస్కృతాలలో ఎం.ఎ. డిగ్రీలు

పరిశోధన : పిహెచ్.డి.
(తెలుగు కన్నడ జానపద గేయాలు)
డి.లిట్.
(ఆంధ్రుల జానపద విజ్ఞానం)

రచనలు : యాభైకి పైగా పుస్తకాలు
వందకు పైగా వ్యాసాలు,
కవిత, పరిశోధన, నవల,
కథ, జీవిత చరిత్ర, విమర్శ,
జానపద విజ్ఞానం, అనువాదం.
తెలుగు, కన్నడ, ఇంగ్లీషు భాషల్లో

రుచి, అభిరుచి : ఎప్పుడూ చదువుతూ రాస్తూ ఉండడం.
మనుషుల్తో మనసువిప్పి మాట్లాడడం.

# ఆర్వీయస్ రచనలు

## కవిత

1. ఆధునిక వేమన శతకము (1969)
2. దిగంబర కవిత (1972) కన్నడంలో ఇతరులతో
3. పిటీలు రాగగళ డజన్ (1976) పఠాభి కవితకు కన్నడం
4. గొరిల్లా (1980) శేషేంద్ర కవితకు కన్నడం
5. నిద్రాపుష్పం (1985)
6. సుందర ప్రభవ (1987)

## జానపద విజ్ఞానం

1. ఆలిచిప్పలు - ఆణిముత్యాలు (1972) జానపదగేయ సంకలనం ఇతరులతో
2. జానపద సాహిత్య స్వరూపం (1976) (1993)
3. జనపద సాహిత్యద మూల తత్త్వగళు (1976) కన్నడం
4. తెలుగు - కన్నడ జానపద గేయాలు (1979) సిద్ధాంత వ్యాసం
5. జానపద విజ్ఞాన స్వరూపం (1980) కన్నడం నుంచి తెలుగుకు
6. భాష - జానపదం (1981) సెమినార్ వ్యాసాలు సం. ఇతరులతో
7. జానపద సాహిత్యం (1982)
8. ఆంధ్రుల జానపద విజ్ఞానం (1983) (1993) డి.లిట్. సిద్ధాంత వ్యాసం
9. కర్నాటకాంధ్ర యక్షగాన సమీక్షె (1985) కన్నడం
10. Studies in Folkloristics (1986) వ్యాసాలు ఇతరులతో
11. ఆంధ్రప్రదేశ్ జానపద (1987) రామరాజుగారి ఇంగ్లీషు పుస్తకానికి

కన్నడానువాదం

## విమర్శ

1. తెలుగు సాహిత్యములో దేశి కవిత (1970)
2. కన్నడ సాహిత్య చరిత్ర (1977)
3. తెలుగు భాషెమత్తు సాహిత్య (1981) కన్నడంలో తెలుగు సాహిత్యం
4. పరిశోధన పద్ధతులు (1990)

## నవల

1. సంస్కారం (1974) కన్నడ నవలకు తెలుగు
2. ఆకాశగంగ (1975) కన్నడ నవలకు తెలుగు
3. సంగవిజయ (1986) మూలపల్లికి కన్నడం
4. భావన (1993) యాత్రా నవల

## జీవిత రేఖా చిత్రాలు

1. పుట్టప్ప కథ (1975) కన్నడ మహాకవి జీవితం
2. దాక్షాయణి (1980)
3. పట్టాభి సీతారామయ్య (1980) కన్నడం
4. కె. రామకోటేశ్వరరావ్ (1980) కన్నడం
5. పంజె మంగేశరావ్ (1981) కన్నడ రచయితను గురించి
6. పాల్కురికి సోమనాథ (1983) కన్నడంలో
7. సి.ఆర్. రెడ్డి (1986) ఇంగ్లీషు నుంచి తెలుగు

## సంపాదకత్వం

1. అనంతరాగం (1977) రాళ్ళపల్లి అభినందన, ఇతరులతో

2. రాళ్ళపల్లి పీఠికలు (1978) ఇతరులతో
3. పఠాభి పన్‌చాంగం (1980)

ఇవికాక

★ తెలుగు పాఠ్య గ్రంథాలు నాలుగు
★ 'జానపదం' సంచికలు 21 (ఇతరులతో)
★ 'చైతన్య కవిత' సంచికలు 16 (ఇతరులతో)
★ కర్నాటక సాహిత్య అకాడెమీ పత్రిక 'అనికేతన' 12 (ఇతరులతో)
★ జానపద విజ్ఞాన భారతి పుస్తకాలు రెండు
★ 'తెలుగు కోయిల' బులెటిన్ కొన్ని సంచికలు

## భాషా విజ్ఞానం

1. తెలుగు - కన్నడ స్వయం బోధిని (1977)
2. భాషె మత్తు భాషావిజ్ఞాన (1978) కన్నడం, ఇతరులతో
3. ధ్వని విజ్ఞాన (1979) కన్నడం, ఇతరులతో

మరికొన్ని పుస్తకాలు

1. బాలధ్రువుడు (1970) కన్నడం నుంచి పిల్లల నాటకం
2. కుట్టోకుట్టో మళెరాయ (1984) బాల విజ్ఞానం కన్నడంలో
3. మాటమంత్ర మోడి ఎష్టునత్య (1989) మంత్రతంత్రాలను గురించి కన్నడంలో
4. కన్నడ సంస్కృతి వైభవం (1990) కన్నడం నుంచి తెలుగుకు
5. నన్నయ భారతం (1993) ఆది సభాపర్వాల వచనానువాదం

# నా నుడి

పాతికేళ్ళ నా రచనా వ్యాసంగాన్ని గూర్చిన జ్ఞాపక చిత్రశాల ఇది. నా మొదటి పుస్తకం అచ్చయిన నాటినుంచి ఈనాటి వరకు గ్రంథ రచనలో, ప్రచురణలో ఏర్పడిన మానవ సంబంధాలను తెలపడమే నా ముఖ్యోద్దేశం. నా అనుభవాలను జ్ఞాపకాలను సహృదయులతో పంచుకుందామనే సంకల్పం ఈ రచనకు ప్రేరేపించింది. పాతికేళ్ళుగా నన్ను వెన్ను తట్టి ముందుకు నడిపించిన వారిని, చేయూత నందించిన వారిని తలచుకోడం నాకెంతో తృప్తి కలిగించే విషయం.

ఇందులో నా పుస్తకాలన్నిటిని గూర్చి వ్యక్తమైన అభిప్రాయాల్ని, ప్రశంసల్ని, సమీక్షల్ని నేను చేర్చలేదు. నా పుస్తకాలలో చాలా వాటిని చదివి నాకు ఉత్తరాలు రాసిన రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి మాటల్ని అక్కడక్కడా ఉదాహరించాను. ఎందుకంటే రాళ్ళపల్లివారు ఏనాడూ ఊకదంపుడు అభిప్రాయాలను వ్యక్తం చేసినవారు కారు. ఆయన లాంటి కొంతమంది పెద్దల ఆశీస్సులే నా గతాన్ని నడిపించాయి.

నే నెప్పుడూ కాయితాలను అక్షరాలతో నింపడమే వృత్తిగా పెట్టుకునేందుకు మిత్రులు, శ్రేయోభిలాషులు చాలా వరకు కారణం. ఒకరిద్దరు చాటుమాటుగా గుసగుసలాడుకున్నవారు లేకపోలేదు. ''మైసూరులో ఇతనికేమీ పనిలేదు కాబట్టి రాసుకుంటూ ఉంటాడు'' అన్న మహానుభావులున్నారు. వారానికి నాలుగయిదు గంటలు ఎం.ఎ. వారికి పాఠాలు చెప్పడమే ఘనకార్యంగా భావించే అలాంటి మహనీయులు నాలో నిరుత్సాహం బదులు ఉత్సాహాన్నే పెంచారు. మైసూరులో మూడు ఎం.ఎ. లకు బోధిస్తూ, అందరికంటె ఎక్కువ తరగతులు తీసుకుంటూ, మిగిలిన సమయాన్నంతటినీ అక్షరదీక్షకు అంకితం చేసుకున్న నేను అసూయా పరులను చూసి నవ్వుకోడం తప్ప ఏం చేయగలను.

పాతికేళ్ళుగా నేను రచనల ద్వారా ఎంతమందిని బాధపెట్టానో! నేను రాసిన ప్రతి అక్షరాన్నీ ఏర్చి కూర్చి ముద్రించిన కార్మికులు ఎంత కష్టపడ్డారో! నాకు సహాయం చేసిన ప్రతి ఒక్కరినీ చల్లని వేళ స్మరించుకుంటాను. నేను రాసి ప్రచురించినవి, సంపాదకుడిగా ప్రతులు తయారుచేసి ముద్రించినవి పెద్దవి చిన్నవి అన్నీ కలిసి 80 కి పైగా పుస్తకాలున్నాయి. వీటిలో ఎక్కువ భాగం మద్రాసు ఫ్రీడమ్ ప్రెస్‌లో, మైసూరులోని అరవింద ప్రెస్, మిత్ర ప్రింటర్స్‌లో అచ్చయ్యాయి. ఆ ముద్రాపకులు నా విషయంలో చూపిన శ్రద్ధను, ఆత్మీయతను మరిచిపోలేను. పాతికేళ్ళుగా నేలమీద నాతోటే కూర్చుని నా పుస్తకాలను, కాయితాలను, చేతి ఒత్తిళ్ళను మోసిన రాత బల్లకు కూడా కృతజ్ఞతలు చెప్పుకోవాలి.

ఈ పుస్తకం ముద్రించే భారాన్ని మిత్రులు చింతల గోపాలరావు గారు స్వీకరించారు. ముద్రణ సౌష్ఠవ సంహారానికి డా. ఎండ్లూరి సుధాకర్ పూనుకున్నారు. సుందర గోపాల సుధాకరులది త్రివేణీ సంగమం. సరస్వతి కనిపించనంత మాత్రాన లేనట్లు కాదు. నేను గోదావరీ క్షేత్రంలో లేకున్నా ఉన్నట్లే అనిపింప జేస్తున్నారు మిత్రులు.

ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు.

భావనామ సంవత్సరం
ఉగాది 11-4-1994

ఆర్వీయస్. సుందరం

# రచనాస్వాదనం

"ఓరేయ్! తెలుగులో తక్కువ మార్కులు తెచ్చుకుంటే నీ వీపు చీరేస్తా"

నెల్లూరులోని ఆర్. ఎస్. ఆర్. ఎం. హైస్కూలులో తెలుగు మాస్టారు. అనంతరామ శాస్త్రిగారు నన్ను ఉద్దేశించి అన్నమాటలివి. అప్పుడు నాకు పదేళ్ళు. నా విద్యార్థి జీవితంలో ఆనాడు మా మాస్టారు అన్న మాటల్ని నేనెప్పుడూ మరిచిపోలేదు. ఆ చిన్న వయసులో శాస్త్రిగారు నేర్పిన ఛందస్సు, వ్యాకరణం నాలో తెలుగు మీద ఆసక్తిని, ఆభిమానాన్ని కల్గించాయి.

అనంతరామ శాస్త్రిగారు మా నాన్నగారికీ గురువే. అందుకే ఆయన నామీద ప్రత్యేకాభిమానం చూపించేవారు.

నెల్లూరులో హైస్కూలు చదువు అయిన తర్వాత నేను మద్రాసు త్యాగరాయ కళాశాలలో చేరాను. ప్రీ యూనివర్సిటీలో సైన్సుతోబాటు అడ్వాన్స్డ్ తెలుగు అనే విషయంకూడా ఉండేది. అందులో విశ్వవిద్యాలయానికంతటికీ నేనే ఎక్కువ మార్కులు తెచ్చుకున్నాను. అనంతరామ శాస్త్రిగారు ఈ విషయం తెలిసి చాలా సంతోషించారు.

నా మొదటి గేయం త్యాగరాయ కళాశాల జర్నల్ లో ముప్పయ్యేళ్ళ క్రితం అచ్చయింది. దాని శీర్షిక 'మతిహీనుడు'. మా నాన్నగారు ఒక కథ చెప్పారు. మా తాతగారిది నెల్లూరు సమీపంలో మరుపూరనే పల్లెటూరు. ఆయన నెల్లూరులో బట్టలు కొనుక్కొని ఊరికి తిరిగి వెళ్తున్నారట. మధ్యలో దొంగలు వచ్చి బట్టలు దోచుకున్నారు. మా తాతగారు వట్టి అమాయకుడు. 'బాబ్బాబు పండక్కి కొత్త బట్టలు తీసికెళ్తున్నాను. నా దగ్గర ఉన్న డబ్బులు ఇస్తాను. బట్టలిచ్చెయ్యండి'

అన్నారట. దొంగలు ఆయన దగ్గర డబ్బులున్నాయని తెలిసి అవి కూడా దోచుకున్నారు.

నా మొదటి రచనకు వస్తువిదే. అప్పటి నుంచి నేను అప్పుడప్పుడూ ఏవైనా రాసి పత్రికలకు పంపిస్తూ ఉండే వాడిని. నాకు విద్యనిచ్చిన గురువులు, స్నేహితులు నన్ను మొదటినుంచి బాగా ప్రోత్సాహించారు. బి. ఎస్ సి.లో నా ప్రధాన విషయం జంతుశాస్త్రం. అయినా తెలుగంటే నాకు మొదటినుంచి ఇష్టమే. బి.ఎస్.సి. అయిన తర్వాత తిరుపతిలో ఎం.ఎస్ సి. చదువుదామనుకున్నాను. కాని అంతలో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో కొన్ని సంవత్సరాలు విరామం తర్వాత మళ్ళీ తెలుగు ఎం. ఎ. తరగతులు ప్రారంభమయ్యాయి. దీనితో నేను ఎం.ఎస్ సి. చదవాలనే ఆలోచన విరమించుకొని తెలుగు ఎం. ఎ.లో చేరాను. దీనికి రెండు కారణాలు. నాకు తెలుగు మీద ఉన్న ఆసక్తి ఒకటి, మా ఆర్థిక పరిస్థితి మరొకటి.

మా నాన్నగారు మద్రాసుకు ముప్పయ్ ఐదు కిలోమీటర్ల దూరంలో ఉండే పొన్నేరిలో బడిపంతులుగా ఉండేవారు. ఆయనకు వచ్చే అరవైరూపాయల జీతంతో మా కుటుంబాన్ని నెట్టుకొచ్చారు. తిరుపతిలో ఎం.ఎస్.సి చదవడమంటే ఖర్చుతో కూడుకున్నపని. అందువల్ల మద్రాసులో చేరి నాకిష్టమైన తెలుగు ఎం.ఎ. చదివాను. ప్రీ యూనివర్సిటీ నుంచి ఎం. ఎ. వరకు ఆరేళ్ళ చదువు నాకు రైళ్ళలోనే సాగింది. రోజుకు మూడు నాలుగు గంటలు పొన్నేరికి మద్రాసుకు మధ్య రైళ్ళలో ప్రయాణం చేసేటప్పుడే చదువుకొనేవాణ్ణి, రాసుకొనే వాణ్ణి.

మాది పండిత వంశం కాదు. మా వాళ్ళలో ఎవరూ పెద్దగా చదువుకున్నవారు లేదు. అంతా ఎస్.ఎస్.ఎల్.సి వరకు చదివి బడిపంతుళ్ళుగా అయ్యారు. మా నాన్నగారొక్కరే ఎఫ్. ఎ. వరకు

చదివారు. నన్ను మొదటి నుంచి నా విద్యాగురువులు, స్నేహితులు వెన్నుతట్టి విద్యాబుద్ధులు నేర్పించారు, నన్ను ఇంతవాణ్ణి చేశారు. నేను మొదటినుంచి అతిశయమైన తెలివితేటలు చూపించిన వాడిని కాను. అసాధారణ ప్రజ్ఞాశాలి అని పించుకున్న వాడిని కాను. అయితే ఏ నాడూ పరీక్షలో తప్పలేదు. మొదటినుంచి నేను బిడియం కలవాడిని. చొచ్చుకుపోయే స్వభావం కలవాడిని కాను. కాని నా జీవితం ఎన్నో మలుపులు తిరిగింది. నాలో వచ్చిన మార్పులను తలచుకుంటే నాకు ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. అటు బాహ్యజీవితంలోను, అంతరంగం లోను కలిగిన మార్పులు నా జీవితానికో మార్గాన్ని నిర్దేశించాయి.

పదిహేను పదహారేళ్ళ వయసులో నాలోని సంకోచ స్వభావానికి నేను స్వస్తి పలికాను. మొదటి సారిగా పదహారేళ్ళ వయసులో వక్తృత్వపు పోటీలో పాల్గొన్నప్పుడు నా కాళ్ళు చేతులు వణికాయి. అయినా మొదటి సారి నాకు మూడవ బహుమతి వచ్చింది. ఆ తర్వాత ఏనాడూ బహుమతి లేకుండా తిరిగి రాలేదు. త్యాగరాయ కళాశాలలో చదివేటప్పుడు వ్యాసరచన, నాటక రచన, వక్తృత్వం, పద్యరచన మొదలైన అన్ని పోటీలలో ఇరవై పైగా బహుమతులు గెల్చుకున్నాను.

బహుమతిగా ఏమివ్వమంటావు ?'' అని అడిగారు అక్కడి మా ఆచార్యులు బిట్రా భావనారాయణగారు.

''పుస్తకాలు ఇవ్వండి'' అన్నాను.

త్యాగరాయ కళాశాల ఉండే వీధిలోనే వావిళ్ళ ప్రెస్ ఉండేది. అక్కడికి తీసికెళ్ళి మా ప్రొఫెసరుగారు నాకు కావలసిన పుస్తకాలన్నీ కొనిచ్చారు. భారతం, మనుచరిత్ర, కళాపూర్ణోదయం, శబ్దార్థ చంద్రిక, గురుబాల ప్రబోధిక, శాకుంతలం మొదలైన చాలా పుస్తకాలు తీసుకున్నాను. అదే నా మొదటి గ్రంథాలయం. ఆ నాటి నుంచి ఇప్పటి వరకు

పుస్తకాలు సేకరిస్తునే ఉన్నాను. నా దగ్గర చాలామంచి గ్రంథాలయం ఏర్పడడానికి ఆనాడే పునాది పడింది.

త్యాగరాయ కళాశాలలో బిట్రా భావనారాయణగారు, డా. రాజగోపాల్ ర్యాలి నా గురువులు. ఇద్దరూ నన్ను ఎంతో ప్రేమతో చూసుకున్నారు. నేను రాసిన వన్నీ రాజగోపాల్ గారికి చూపిస్తుండేవాడిని. ఆయన దాదాపు ఇరవై ఎనిమిదేళ్ళనాడు అమెరికా వెళ్ళారు. అక్కడే పిహెచ్.డి. చేశారు. ప్రస్తుతం మాంటగొమరిలోని జాబర్న్ విశ్వవిద్యాలయ ంలో ఆచార్యులుగా ఉన్నారు.

నా చదువు అయిపోయినా నా గురువులతో ఏదో విధమైన సంబంధం కలిగి ఉన్నాను. అది అంతరంగంలోంచి వచ్చిన ఆత్మీయత. అది అమూల్యమైన అనుబంధం ఈ అనుబంధం నా విద్యాత్మక జీవితంలో విచిత్రమైన సంఘటనలకు దారితీసింది. నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దింది.

నేను త్యాగరాయ కళాశాలలో చదివేటప్పుడు ఒకసారి మా తరగతిలో భావనారాయణగారు ''నేను ఎప్పటికైనా డాక్టరేట్ తీసుకుంటానయ్యా'' అన్నారు. కాని ఆయన డాక్టరేట్ చెయ్యటానికే వీలు కాలేదు. ఆయన ఈ మాట చెప్పిన తర్వాత సుమారు పదిహేనేండ్లకు నేను ఆయనను మైసూరులో పరిశోధకుడిగా చేర్పించాను. అప్పటికి వారికి సుమారు అరవై అయిదేళ్ళకు పైబడి ఉంటాయి. పరిశోధకగ్రంథం పూర్తి చేసి సమర్పించగానే వారి పర్యవేక్షకులు కె. సుబ్బరామప్పగారు చనిపోయారు. అప్పుడు నేనే మా గురువుగారికి పరీక్షకుడినై ఆయనకు డాక్టరేట్ ఇప్పించాను. ఇది నేను జీవితంలో మరిచిపోలేని సంఘటన.

డా. ర్యాలి రాజగోపాల్ గారు అమెరికా వెళ్ళినా నన్ను ఆయన, ఆయనను నేను మరిచిపోలేదు. నా డి.లిట్. కు ఐదుగురు పరీక్షకులలో ఆయనా ఒకరు.

నేను చిన్నతనంలో ఎంత బిడియంగా ఉండేవాడినో తర్వాత అంత ఎక్కువ చురుకుగా అన్నిట్లో పాల్గొనసాగాను. నేను ప్రెసిడెన్సీ కళాశాలలో చేరే ముందు అక్కడి ప్రొఫెసరు సాళ్వకృష్ణమూర్తిగారిని కలిశాను. నేను ఎన్ని బహుమతులు తెచ్చుకున్నది, తెలుగులో ఎంత చురుగ్గా ఉన్నది చాలా ఉత్సాహంగా చెప్పాను. కాని ఆచార్యకృష్ణమూర్తి గారు ఏమీ మాట్లాడలేదు. నాకు చాలా నిరుత్సాహం కలిగింది. తర్వాత ఒకసారి మా ప్రొఫెసరుగారే చెప్పారు. ''నీవు ఎంత ప్రతిభావంతుడవో నిన్ను చూడగానే తెలుసుకున్నాను. కాని నిన్ను పొడిగితే మరీ రెచ్చిపోతావని, నిన్ను నీవు తెలుసుకోలేవని అలా ఊర్కుండి పోయాను.''

నా జీవితంలో సాళ్వ కృష్ణమూర్తిగారి వల్ల ఎన్నో పాఠాలు నేర్చుకున్నాను. వారికి నామీద ఎంత అచలమైన ప్రేమ ఉందో తర్వాత ఎన్నో సంఘటనల వల్ల తెలుసుకున్నాను. ప్రెసిడెన్సీ కళాశాలలో డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు, డా. ఎల్. బి. శంకరరావుగారు, డా.పి. ఉమగారు సదా నా అభివృద్ధిని కాంక్షించారు. నేను ఏం రాసినా చదివి నాకు ఎన్నో సలహాలు ఇచ్చారు.

# పుస్తక రచన

పుస్తకాలు చదవడం నాకు హైస్కూలులోనే అలవడింది. అయితే అప్పట్లో ఎక్కువగా డిటెక్టివ్ నవలలు చదివేవాణ్ణి. ఒకటి రెండు సార్లు ఈ విషయమై మా నాన్నగారి చేత తన్నులు కూడా తిన్నాను. దేవదాసు, బడదీది మొదలైన నవలలు కూడ నాకు 12-13 ఏళ్ళ వయసున్నప్పుడే చదివాను. కాలేజిలో చేరిన తర్వాత పదహారు పదిహేడేళ్ళకు వందల పుస్తకాలు చదివేశాను. శ్రీ శ్రీ మహాప్రస్థానం పదహారోఏట చదివి

'ఏమిటీ రచన' అని ఏవగించుకున్నాను. అప్పటి నా నేపథ్యం అలాంటిది. నా విద్యార్థి జీవితమంతా గురువుల ప్రభావంతోనే సాగింది. వారిలో చాలామంది. సంప్రదాయవాదులే. మొదటినుంచి నాకు వ్యాకరణం, ఛందస్సు, అలంకారం, ప్రాచీన కావ్యాలు ఇష్టమైన విషయాలు.

నాకు పుస్తకాలు రాయాలనే ఆలోచన పుస్తకాలు ఎక్కువగా చదవడం వల్లనే కలిగింది. నేను ప్రీ యూనివర్సిటీ చదివేటప్పుడు తిమ్మవజ్ఝల కోదండ రామయ్యగారి 'పాలవెల్లి' పాఠ్యగ్రంథంగా ఉంది. కోదండ రామయ్యగారు నేను చదివిన త్యాగరాయ కళాశాలలోనే నేను చదవడానికి ముందు పనిచేశారు. బి.ఎస్ సి.లో మా గురువు బిట్రా భావనారాయణగారి 'విషయ' అనే నవల ఉపవాచకంగా ఉంది. గురుతుల్యులైన కోదండరామయ్యగారు, గురువుగారైన భావనారాయణగారు రాసిన పుస్తకాలు నాలో ఏదైనా రాయమని ప్రేరణ కలిగించాయేమో! భావనారాయణగారు మా క్లాసులో అప్పుడప్పుడు చెప్పేవారు: ''నేను ఎన్నేళ్ళు బతుకుతానో అన్ని గ్రంథాలు రాయాలని ఉందయ్యా'' అని ఆ మాటలు ఇప్పటికీ నా చెవిలో గింగురుమంటూనే ఉన్నాయి. బహుశా నేను ఇన్నిగ్రంథాలు రాయటానికి ముఖ్య ప్రేరణ ఆ మాటలే అనుకుంటాను. మా గురువుగారు చేయలేకపోయిన కార్యాన్ని నేను చేస్తానని అప్పట్లో నేననుకోలేదు.

నా మొదటి అముద్రిత గ్రంథం 'విద్యార్థి' అనే నవల. దీన్ని బహుశా నా పద్దెనిమిదో ఏట రాశాననుకుంటాను. నా విద్యార్థి జీవితంలో నేను ఎన్నో వింత అనుభవాల్ని చవిచూశాను. బీదతనం చవిచూపిన కష్టాన్ని అనభవించాను. స్నేహితుల ఆప్యాయానురాగాల వెల్లువలో మునిగి తేలాను. కుటుంబంలో ఎన్నో ఒడిదుడుకుల్ని ఎదుర్కొన్నాను. ఇవన్నీ నా నవలకు వస్తువయ్యాయి. మొదటినుంచి నాకు కరుణరసం అంటే

అభిమానం. స్నేహితులతో ఎప్పుడూ సరదాగా ఉండేనాలో విషాదచ్ఛాయల్ని చూసి స్నేహితులు ఆశ్చర్యం చెందేవారు. హాస్యం, శోకం నాలోవింతగా పెనవేసుకు పోయాయి. విషాదాంతంగా మిగిలిన నానవల అప్పటి ఇప్పటికీ అముద్రితంగానే ఉంది.

నేను గాంధీజి చనిపోయిన మూడు నెలలకు పుట్టాను. నెల్లూరులో మా పక్కింటి వాళ్ళు నన్ను 'గాంధి' అనే పిలిచేవారు. చిన్నతనంలో నాకు గాంధీజి అంటే అపరిమితమైన అభిమానం. డి యంకె అధినేత సి.ఎన్. అణ్ణాదురై 'ఉలగపెరియార్ గాంధి' అనే చిన్న పుస్తకం రాశారు. నేను ఆ పుస్తకాన్ని 'లోకోన్నతుడు గాంధి' అనే పేరుతో అనువాదం చేశాను. అది నా మొదటి అనువాద గ్రంథం. అప్పటికీ ఇప్పటికీ తమిళం నుంచి తెలుగులోకి నేను అనవదించిన ఒకే ఒక్క పుస్తకమది. దానిన ప్రచురించాలని నేను ఏనాడూ అనుకోలేదు.

## ముద్రిత గ్రంథాలు

రచనల్ని అచ్చులో చూసుకోడమనేది ఎవరికైనా సంతోషదాయకమే. ఆ అనుభవం ఎలాంటిదో రచయితలందరూ ఏదో ఒక నాడు రుచి చూసే ఉంటారు. ఆ వింత అనుభవం తర్వాత తర్వాత ఒక జీవన పథంగా, కార్యదీక్షగా, సార్థక జీవిత సోపానంగా రూపు దిద్దుకుంటుంది. ముప్ఫయ్యేళ్ళ నుంచి ఈ అక్షర ప్రవాహం నన్ను పునీతుణ్ణి చేసింది.

'ఆధునిక వేమన శతకము' నా మొదటి ముద్రిత రచన (1969). ఇరవై అయిదేళ్ళుగా పుస్తకాలు రచించడం, అచ్చువేయడం నా నిత్యవ్యవహారమై పోయించి.

నా ప్రారంభ రచనలు వెలువడిన కాలం నాటికి, ఈనాటికీ

నాలో ఎన్నో మార్పులు వచ్చాయి. అప్పట్లో నేను వీరగ్రాంథికవాదిని. శుద్ధ సంప్రదాయవాదిని. నా ప్రారంభరచనలన్నీ గ్రాంథిక భాషలోనే ఉన్నాయి. ఒక్క నవల తప్ప. 'ఆధునిక వేమన శతకము' వెలువడే నాటికి నా వ్యాసాలు కృష్ణాపత్రిక, ప్రజామత, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, భారతి, స్రవంతి మొదలైన పత్రికల్లో వెలువడ్డాయి. అవన్నీ గ్రాంథిక భాషలో రాసినవే. గ్రాంథిక భాష పరిత్యాజ్యమా' అనే పేరుతో నేను 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక'లో రాసిన వ్యాసాన్ని (1969) చదివితే ఇప్పుడు నాకు నవ్వు వస్తుంది. ఆ నేను నేనేనా అని. నేను వీరగ్రాంథికంలో రాసిన ఒక వ్యాసం చదివి మా గురువు ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు 'నీవు వ్యావహారికంలో రాయరాదూ' అన్నారొక సారి. కాని అప్పట్లో నేను ఆయన మాటల్ని వినే స్థితిలో లేను. అలాంటప్పుడే నా మొదటి ముద్రిత రచన వెలువడింది.

## 1969

అప్పుడింకా నేను ఎం. ఎ. చదువుతున్నాను. ఒకరోజు ఇంటినుంచి బయలుదేరి మైలు దూరంలో ఉన్న పొన్నేరి రైల్వే స్టేషనుకు వెళ్తున్నాను. రైలు కట్ట మీద నడుస్తుంటే ఉన్నట్టుండి ఓ పద్యం మనసు లోనుంచి తన్నుకొచ్చింది. అది ఆటవెలది. అప్రయత్నంగానే చివరి పాదం 'విశ్వదాభిరామ వినుర వేమ' అయి కూర్చుంది. బహుశా ఈక్రింది పద్యమే అనుకుంటాను :

గుండె పగులునట్లు గొల్లుమనునొకండు
విరగబడుచు నవ్వు వేడ్కనొకడు
మాయదారి జగము మౌనముగా నుండు

విశ్వదాభిరామ వినురవేమ.

అలాగే రోజూ అల్లుతూ ఉంటే పద్యాలు వస్తూనే ఉన్నాయి. కీలకనామ సంవత్సరం సంక్రాంతి రోజుకు (14-1-1969) వందపద్యాలు ముగించాను. ముగించిన తర్వాత దీన్ని అచ్చు వేస్తే ఎలా ఉంటుంది. అనే ఆలోచన పట్టుకొని పీడించ సాగింది. అప్పట్లో మద్రాసులో 'కథాంజలి' అనే మాసపత్రిక వెలువడేది. ~~ఈ~~శతకాన్ని ఇస్తే దానిలో ధారావాహికంగా ప్రచురించారు.

ఆ రోజుల్లో నేను ఒక్కపుస్తకమైనా అచ్చువేసుకో గలగనే నమ్మకం నాకు లేదు. అలాంటి సమయంలో ఎం. ఎ. లో నా సహాధ్యాయి ఇ. రఘునాథ రెడ్డి ''సుందరం, బాధ పడకు. నీ పుస్తకం అచ్చువేయడానికి డబ్బులు నేనిస్తాను'' అన్నాడు.

రఘునాథరెడ్డి నా సహాధ్యాయి మాత్రమేకాదు. నాకు అన్నయ్య. అప్పటికీ ఇప్పటికీ మా అనుబంధం మాసిపోలేదు. నా మొదటి పుస్తకాన్ని వెలుగులోకి తీసుకువచ్చి నా రచనావ్యాసంగానికి నాంది పలికిన మా అన్నయ్యను నా జీవితంలో ఎప్పటికీ మరిచిపోలేదు. పుస్తకం అచ్చువేసే సమయానికి మిత్రుడు రఘునాథరెడ్డి దగ్గర వంద రూపాయలు మాత్రం ఉన్నాయి. దాన్ని అడ్వాన్సుగా ఫ్రీడమ్ ప్రెస్ (చాకలిపేటలో ఉండే ప్రసిద్ధమైన ప్రెస్సు. మదరాసులో తెలుగు గ్రంథాల ప్రచురణ ఎక్కువగా జరుగుతుండిన ప్రెస్సులలో అది ఒకటి) వారికి ఇచ్చాను.

అప్పట్లో వేమన శతకం ప్రచురణకు (వెయ్యి కాపీలకు) బహుశా రెండు వందలయిందనుకుంటాను. సంక్రాంతికి పూర్తిచేసిన శతకాన్ని ఇప్పటికి ఇరవై ఐదు ఉగాదుల ముందు సౌమ్య ఉగాది నాటికి ప్రచురించాను. అలా సౌమ్య ఉగాది నా పాలిట యుగాదే అయింది. నేను అప్పుడప్పుడు కష్టపడి దాచుకున్న డబ్బులన్నీ చేర్చి మరో వంద ఇచ్చి పుస్తకాలు

తెచ్చుకున్నాను. ఎం. ఎ. పూర్తి చేయ్యగానే నాకు కోలారు జిల్లా, చింతామణిలో ఉద్యోగం దొరికింది. ''నాకు ఉద్యోగం కూడా దొరికింది. నా పుస్తకం తాలూకు డబ్బులు నువ్వేమీ ఇవ్వక్కర లేదులే'' అన్నాను రఘునాథ రెడ్డితో. కాని అతను వినలేదు. ''నేను ఇస్తానన్నాను. ఇస్తాను'' అని బెల్లం అమ్మగా వచ్చిన డబ్బులోంచి వంద రూపాయలు ఇచ్చి తాను ఋణ విముక్తుడై నన్ను ఋణపడేట్లు చేశాడు.

నా మొదటి పుస్తకం వెలువడడానికి మరో ముఖ్యకారకుడు ఎం.ఎ.లోనే మరో సహాధ్యాయి డా. టి. గోపాలకృష్ణారావు. అచ్చు పనుల్లో ఏమాత్రం అనుభవం లేని నాకు ఎన్నో దారులు చూపించి, తన చిరునామానే నా పుస్తకానికి విలాసంగా ఇచ్చాడు. గోపాలకృష్ణారావు. వాళ్ళ నాన్నగారు నా పుస్తకాలను అమ్మిపెట్టారు. గోపాలకృష్ణకు నాకు ఉన్న అనుబంధం ఈనాటికీ చెక్కు చెదరలేదు. మరో గమ్మత్తేమిటంటే నా మిత్రుడే నా మొదటి పరిశోధన విద్యార్థికూడా. తెలుగు కన్నడాలలోని జానపద రామాయణాలను గురించి పరిశోధించి పిహెచ్.డి. పట్టం పొందాడు.

నేను, నా మిత్రుల గొడవ అలా ఉంచి అసలు 'ఆధునిక వేమన' శతకానికి వెన్ను బలంగా నిల్చిన ఆచార్య సాళ్వకృష్ణమూర్తిగారిని గురించి ఎంత చెప్పినా తక్కువే. ఏదో ఒక శతకం రాశాను, ముద్రించ దలిచాను-అంతమాత్రమే కాని దానిలోని ఆనుపానులన్నీ నాకేం తెలుసు! ప్రూఫులు దిద్దడం కూడా నాకు రాదు. అందులోని ప్రతి పద్యాన్నీ మా గురువుగారే చదివి దిద్దిపెట్టారు. ప్రూఫులన్నీ వారే దిద్దారు. వారి శిష్య వాత్సల్యానికి! ఏపుత్ర వాత్సల్యం ఎక్కువవతుంది?

అంతేకాదు. ఆ తర్వాత నాకు విషయం తెలిసింది. అంతక్రితమే వారం రోజులనాడు మాగురువుగారి తమ్ముడు అకాల మృత్యువు

పాలయ్యాడుట్రైకోనా ఆ శోకాన్ని కడుపులో దాచుకొని, నా పుస్తక ప్రచురణ ఆలస్యం కాకూడదని, సకాలంలో రావాలని ప్రూఫులన్నీ దిద్దిపెట్టారు మా కృష్ణమూర్తిగారు. నాకా విషయం తెలిసి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అలాంటి గురువర్యులను పొందిన అదృష్టం నాది

'ఆధునిక వేమన శతకం' ఆచార్య సాళ్వ కృష్ణమూర్తిగారి మంగళా శాసనంతో ప్రచురితమైంది. 'ఈ వర్ధిష్ణువుమజేంత భారతీ కటాక్ష సౌందర్య దర్శనమునకు బాత్రుడై ముందు ముందు సంస్పంద సుందరమైన కావ్య కన్యాపరిష్క్రియ వెలార్చుటకిది క్షేమంకర మైన యల్పారంభమే యగును గాక'' అన్నారాయన.

వారి 'మంగళాశాసనం' మీద ఒక జోక్ ఉంది. దాన్నీ చెప్పేస్తాను. మా గురువుగారిది అత్యంత ప్రౌఢశైలి. ఒకసారి పండిత మిత్రుడొకరు నా పుస్తకాన్ని గురించి చెప్తూ ''మీ గురువుగారు కృష్ణదేవరాయలకంటె ప్రౌఢతగలవారు. వారిది సాళ్వ వంశం కదా - తుళువవంశంకంటె ముందుది అన్నారు.

నా శతకాన్ని గురించి నిడదవోలు వేంకటరావుగారు ఒక పద్యం రాసి పంపారు.

రాళ్ళపల్లి సుందరము రచనను చూచి
నీకు బోలె నతడు లోకమందు
ఘనత జెందుననుచు ననుకొన జెల్లును
విశ్వదాభిరామ వినుర వేమ.

సహృదయ పరమేశ్వరుని కొక నమస్కారం!

# 1970

మొదటి పుస్తం వెలువడిన తర్వాత నేనిక వెనుదిరిగి చూడలేదు. రచనా వ్యాసంగం నా ముఖ్యవ్యాపకం అయింది. ప్రెసిడెన్సీ కళాశాలలో నేను విద్యార్థిగా ఉన్న రోజుల్లోనే 1968-69 సంవత్సరానికి గాను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారి బహుమతికోసం ప్రకటన వెలువడింది. అది కూడా నా జీవితంలో ఒక ముఖ్య సంఘటన ఎందుకంటే నా పరిశోధన జీవితానికి ఆప్రకటన నాందీగీతం లాంటిది. 'తెలుగు సాహిత్యములో దేశికవిత'' ను గూర్చి పుస్తకాలను ఆహ్వానించారు అకాడెమీ వారు. దేశి కవితవైపు నా మనస్సును తిప్పిందా ఆహ్వానం. అదే తర్వాత జానపద సాహిత్యం వైపు కూడా నన్ను తిప్పుకుంది.

సాహిత్య అకాడెమీ బహుమతి కోసం .రచన చేద్దామని నాకు ఆలోచన కలగడం పెద్ద సాహసమే. ఎందుకంటే ఆనాటికి అకాడెమీ బహుమతులు పొందిన వారు గొప్ప పండితులు, నిడుదవోలు వేంకటరావుగారు, గిడుగు సీతాపతిగారు, వేదం వేంకట రాయ శాస్త్రి (జూనియర్)గారు, అమరేశం రాజేశ్వర శర్మగారు. అలాంటివారి సరసన నన్ను ఊహించుకోవడానికి కూడా సాధ్యంకాదు. అయినా ప్రయత్నం చేద్దామని పూనుకున్నాను. దీనికీ నా మిత్రుడు డా. గోపాల కృష్ణారావు ప్రోత్సాహం ఉంది. ''నీకు తప్పకుండా బహుమతి వస్తుంది. రాయి'' అన్నాడు.

నేను చదివే రోజుల్లోనే ప్రెసిడెన్సీ కళాశాలకు సమీపంలోనే ఉన్న ప్రాచ్యలిఖిత భాండాగారానికి వెళ్ళడం అలవాటయింది. నేను వెళ్ళే ఆరోజుల్లోనే ఆరుద్రగారు సమగ్రాంధ్ర సాహిత్యం కోసం ప్రతిరోజూ అక్కడికే వచ్చేవారు. గ్రంథాల్లోంచి విషయాలు ఎలా రాసుకోవాలి,

పుస్తకాల్లోంచి విషయాలను ఎలా ఉపయోగించుకోవాలి. మొదలైన విషయాలను అప్పుడప్పుడు చెప్తుండేవారు. అదే గ్రంథ భాండాగారంలో తెలుగు పండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తితో నిత్యమూ సాహిత్య చర్చ జరుగుతూనే ఉండేది. ఇలా తయారయింది ''తెలుగు సాహిత్యములో దేశికవిత''.

నాపుస్తకానికి బహుమతి వచ్చే సమయానికి నేను చింతామణి కాలేజిలో లెక్చరరుగా చేరాను. చింతామణి బెంగుళూరికి 45 కిలోమీటర్ల దూరంలో కోలారు జిల్లాలో ఉంది. నాకు దేశికవితకు గాను సాహిత్య అకాడెమీ వారు 2000 రూపాయలు ఇచ్చారు. అది ఆకాలంలో చాలా పెద్ద మొత్తమే. బహుశా ఈనాడు ఇరవై వేల రూపాయలకంటె ఎక్కువే అనుకుంటాను. ఎందుకంటే ఈ రోజుల్లో 250 పుటల రాతప్రతి (చిన్న అచ్చులో 156 పుటలు వచ్చింది) వెయ్యికాపీలు వెయ్యాలంటే ఇరవైవేల రూపాయలు అవుతుంది. అప్పట్లో 'తెలుగు సాహిత్యములో దేశికవిత'తో బాటు 'బాలధ్రువుడు' అనే మరో చిన్న పుస్తకం (23 పుటలు) కూడా వెయ్యి కాపీలు వేస్తే నాకు 1500 రూపాయలు మాత్రం ఖర్చయింది. అకాడెమీ వారిచ్చిన బహుమతితోనే ప్రచురణ ఖర్చులు పోను 500 రూపాయలు మిగుల్చుకున్నాను.

దేశికవిత సాధారణ ఉగాది (7-4-1970) నాటికి అచ్చయింది. అంటే నా మొదటి పుస్తకం అచ్చయిన సంవత్సరానికి మరో పుస్తకం అచ్చు వేయగలిగాను.

ఒక్కొక్క పుస్తకం ప్రచురించడానికి ఎంతగా కష్టపడే వాడినో తలచుకుంటే 'ఎవరి పిచ్చి వారికానందం' అనే సామెత జ్ఞాపకం వస్తుంది నాకు. నేను చాలా మందిలా ఒక్కోపని ఒక్కొక్కరికి అప్పజెప్పి నిశ్చింతగా ఉండే రకం కాదు. ఏ పనైనా తలపెడితే సమస్తమూ నా నెత్తినే

చేసుకునే మనస్తత్వం నాది. నా పుస్తకాలన్నీ నేనే ప్రతి తయారు చేసుకుంటాను. ప్రెస్‌కాపీ తయారు చేస్తాను. ప్రెస్సుల చుట్టూ తిరగడం దగ్గర నుంచి ప్రూఫుల చూసేవరకు అన్నీ నేనే చేసుకుంటాను.

నా పుస్తకాలలోను, నేను ఇతరులతో కలిసి రాసిన పుస్తకాలలోను అత్యధిక భాగం అలా తయారయినవే. ఈ విషయాలను నాకు నేర్పిన వారు ఆచార్య సాళ్వ కృష్ణ మూర్తిగారు, తీర్థం శ్రీధర మూర్తిగారు, రావూరి దొరసామి శర్మగారు, తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు. నేను చింతామణినుంచి, మైసూరునుంచి కూడా మద్రాసుకు వెళ్ళి ఫ్రీడమ్ ప్రెస్సులో అచ్చుకు ఇచ్చేవాడిని. పొన్నేరి నుంచి రైలులో పాసు తీసుకొని రోజూ మద్రాసు వెళ్ళి అచ్చుపనులు చూసుకునే వాడిని. తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారితో నాకు ఫ్రీడమ్ ప్రెస్‌లోనే పరిచయం మయింది.

దేశికవితకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి వచ్చే సరికి నా ఉత్సాహం పెల్లుబికింది. ఆచార్య సాళ్వ కృష్ణమూర్తిగారు నన్ను అభినందిస్తూ గొప్ప ఉత్తరం రాశారు. ''నా విద్యార్థులు ప్రతిభావంతులు, కార్యదీక్ష కలవారు అని చెప్పుకోవడానికి ఇంత కంటె నిదర్శనం ఏం కావాలి'' అని రాశారు.

ఈ మధ్యలో ఒక ప్రసంగం జరిగింది. నేను ఒకసారి తిరుపతికి వెళ్ళాను. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారిని చూడడానికి వెళ్ళాను. అదే వారితో మొట్టమొదటి సారి సంభాషించడం. ప్రసంగవశాన వారు ''మీ బహుమతికి నేనే కారణం. బాగా రాశారు. రచనలు కొనసాగించండి'' అన్నారు. నా ఆనందానికి అవధులు లేకపోయింది. రాళ్ళపల్లివంటి మహనీయుడి చేతి చలవవల్ల బహుమతి అందుకున్నందుకు పొంగి పోయాను. బాల్య చాపల్యం వల్ల 'నాకు మీరే పీఠిక రాసి పెట్టండి'' అన్నాను.

''నేను అలాంటి పని చేయను. నేను బహుమతిని సిఫారసు

చేసిన వాడిని కాబట్టి పీఠిక రాయకూడదు'' అన్నారు. వారి నిజాయితీకి మనసులోనే జోహారు లర్పించాను. నాజీవితంలో నేర్చుకొన్న గొప్ప పాఠమది. తరువాత కాలంలో ఎన్నో విషయాలలో రాళ్ళపల్లివారి సౌజన్యం నిజాయితీ, కార్యదీక్ష నాకు చుక్కానిలా పని చేశాయి.

ఆ సందర్భంలోనే నా పేరు మార్చుకునే ఆలోచన కూడా కలిగింది. రాళ్ళపల్లివారిని కలిసినప్పుడు వారు మీరాళ్ళపల్లి మారాళ్ళపల్లి ఒకటేనా ''అని అడిగారు. నేను 'ఆధునిక వేమన శతకము'ను 'రాళ్ళపల్లి సుందరం' పేరుతోనే ప్రచురించాను. కాని రాళ్ళపల్లివారు ఎప్పుడైతే ప్రశ్న వేశారో అప్పుడేనాలో మథన ప్రారంభమయింది. 'రాళ్ళపల్లివారి పేరును నేనెందుకు వాడుకోవాలి. నా సొంత వ్యక్తిత్వాన్ని నేను రూపొందించుకోవాలి' అని నిశ్చయించుకున్నాను. అందుకే ఆనాడే రచనల్లో నాపేరును 'ఆర్వీయస్. సుందరం'గా మార్చుకున్నాను. ఈయనది రాళ్ళపల్లి వంశం. అందుకే రాస్తున్నాడు' అని కాక సుందరం ఏదో చేస్తున్నాడు అని పించుకోవాలని నా ఆశ. నిజానికి వాళ్ళ రాళ్ళపల్లికి మా రాళ్ళపల్లికి ఏమీ సంబంధం లేదు. అయినా అదేమిటో చిత్రం, రాళ్ళపల్లి వారు పనిచేసిన స్థానంలోకే నేను వెళ్ళాను. వారు మైసూరులో సుమారు నలభై ఏళ్ళు పనిచేసిన స్థానంలో నేను ఇరవై ఏళ్ళుగా ఉన్నాను. వారిలాగే కన్నడంలో అంతో ఇంతో కృషి చేసే అవకాశమూ లభించింది.

''తెలుగు సాహిత్యములో దేశికవిత' నుంచి నా పుస్తకాలు చాలా వాటిని చూసి, చదివి రాళ్ళపల్లి వారు అభిప్రాయాలు రాసి పంపారు. అవన్నీ నాకు శిరోధార్యాలయ్యాయి. ఎందుకంటే వారిదెప్పుడూ ఖచ్చితమైన అభిప్రాయం. మెచ్చుకోలుతోబాటు. లోపాలను నిస్సంకోచంగా ఎత్తిచూపే నిజాయితీ వారిది.

దేశి కవితను గురించి రాళ్ళపల్లిగారు రాసిన మాటలు కొన్ని

(వారి లేఖ 18-7-1970):

''మన దేశికవితను గూర్చి మీరు చేసి చూపిన వ్యాసంగము గొప్పది. అనేక భిన్న రచనలు పరిశీలించి వివేచించి విభజించి గ్రంథమును నిర్వచించితిరి. ఆడంబరము అనపేక్షిత విస్తర లేని విషయము ప్రధానమైన శైలితో సాగినది మీరచన. సాహిత్య అకాడమీవారు దీనికి బహుమతి నిచ్చుట వారి యర్హతాగ్రహమునే స్ఫుటపరుచును. మీకు నా హార్దాభినందనములు''

తర్వాత 'మార్గకు మార్గము'' 'గానరసంఫణిః' మొదలైన శబ్దాలను గూర్చి సలహాలు ఇచ్చారు. 'కొన్ని యితరుల తెలుగు వాక్యములకు మూలగ్రంథములను సూచించుట యావశ్యకము'' అన్నారు.

దేశికవితకు కూడా ఆచార్య సాళ్వ కృష్ణమూర్తిగారే 'మంగశాశాసనం' రాశారు నన్ను గురించి రాస్తూ ''చోదితో. గురుణానిత్య మప్రచోదిత ఏవవా, కుర్యాదధ్యయనే యత్న మాచార్యస్య హితేషుచ'' అన్న ఛాత్రధర్మానికి పాత్రమని చెప్పడం నామీద వారికి గల వాత్సల్యానికి నిదర్శనం.

## బాలధ్రువుడు

దేశికవితతో బాటే నేను ప్రచురించిన మరో చిన్న పుస్తకం బాలధ్రువుడు. అది కన్నడంనుంచి నేను అనువదించి ప్రచురించిన మొదటి పుస్తకం, చింతామణి కాలేజీలో నేను చేరిన పది పదిహేను రోజులలోనే కన్నడం నేర్చుకోవడం మొదలెట్టాను. బహుశా రెండు నెలలలోపే కన్నడ మహాకవి కె.వి. పుట్టప్పగారి కొన్ని కవితల్ని తెలుగులోకి అనువదించాను.

చింతామణిలో ఒక అపూర్వవ్యక్తి ఉన్నారు. ఆయన పేరు వై.ఎస్. గుండప్ప. ఆయనకు 'సాహిత్యకూట' అనే సంస్థ ఉంది. ప్రతి వారం ఒక్కొక్క ఉపన్యాసం ఇప్పిస్తుంటారు. నేను దాదాపు పది ఉపన్యాసాలు ఇచ్చి ఉంటాను. విశేష మేమిటంటే దాదాపు నలభైయేళ్ళుగా ఒక్కవారంకూడా తప్పకుండా ప్రతిశనివారం ఆయన ఉపన్యాసాలు ఇప్పిస్తున్నారు. ఇప్పుడు ఆమహానీయుడికి తొంభైయేళ్ళు దాటాయి. అయినా సాహిత్యసేవ చేస్తూనే ఉన్నారు. ఆయన రాసిన చిన్న నాటకమే 'ధ్రువ బాల' అందులో రాగతాళాలతో కూడిన కీర్తనలున్నాయి. ఆ గద్య-గేయనాటకాన్ని నేను చింతామణికి వెళ్ళిన ఆరునెలల్లో అనువదించాను. వై.ఎస్. గుండప్పగారికి నాకు మధ్య ఏర్పడిన అవ్యాజానుబంధసూచకంగా దేశికవితతోబాటు 'బాలధ్రువుడు' పేరుతో ఆ పుస్తకాన్నీ అచ్చువేశాను. నాకు కన్నడాన్ని అనువదించడంలో, గేయాల్ని రాయడంలో తీర్థం శ్రీధరమూర్తిగారు సహాయం చేశారు.

పైన దేశికవితను గురించి రాళ్ళపల్లివారు రాసిన ఉత్తరంలోనే (18-7-1970) 'బాలధ్రువుడు' గురించి ఈ కింది మాటల రాశారు: 'బాలధ్రువుడు' ను గూర్చి నేను వ్రాయగలదేమియు లేదు. బాలురకిది అభినయోపయోగ్యమైన రచన. కాని నాటకీయత దగినంత లేదేమోయనిపించినది. అందలి కొన్ని పాటలకు మాత్రమే మీరు సూచించిన 'స్వరరచన' వలసినంత స్పష్టముగా లేదు''.

'బాలధ్రువుడు' నాటకానికుండే పరిమితుల్ని చక్కగా సూచించారు రాళ్ళపల్లివారు. అది స్నేహధర్మంగా వెలువడిన రచన మాత్రమే అని నేనూ భావించాను.

# 1971

ఈ సంవత్సరం నా పుస్తకాలేవీ వెలువడలేదు. కాని నా జీవితగమనమే మారిపోయింది. 1970లో పిహెచ్.డి.కోసం మైసూరు విశ్వవిద్యాలయంలో రిజిష్టరు చేసుకున్నాను. మొదట తెలుగు కన్నడాలలో దేశి కవితనుగూర్చి పరిశోధన చేద్దామనుకున్నాను కాని తర్వాత అది అతివిస్తారమని 'తెలుగు-కన్నడ జానపద గేయాలు' అనే విషయాన్ని తీసకున్నాను. దీనితో జానపద సాహిత్యక్షేత్రంలోకి అడగుపెట్టాను. తర్వాత దాన్నే నా ముఖ్య పరిశోధన క్షేత్రంగా చేసుకున్నాను. దీనికి ముఖ్యకారణం అప్పటికే కన్నడంలో చాలామంది కృషి జరగడం. అదే రకమైన కృషిని తెలుగులో కొనసాగించాలనే సంకల్పం కలిగింది. అదీ కాక తులనాత్మక జానపద సాహిత్యాన్నికూడా తెలుగులో ప్రవేశ పెట్టాలనే ఆలోచన తోడయింది.

1971లో పరిశోధన మొదలుపెట్టాను. సిద్ధాంత గ్రంథాన్ని రెండేళ్ళలో సమర్పించాలని నా సంకల్పం. నిబంధనలు మేరకు సరిగ్గా రెండేళ్ళుదాటిన రోజునే సిద్ధాంతగ్రంథాన్ని సమర్పించగలిగాను. 1971లో విషయసేకరణ ముమ్మరంగా సాగించాను.

మరోరకంగా నా రచనా పద్ధతి, జీవన విధానం, ఆలోచనా పథాలు, విశ్వాసాలు గొప్పమలుపు తిరిగిన సంవత్సరమిది.

బహుశా ఆగస్టులో నెల్లూరు వెళ్ళాను. మా సమీప బంధువులింట్లో 'దిగంబర కవిత' పుస్తకం కనిపించింది. ఆ నాటికి నేను ఆధునిక కవిత్వాన్ని మెచ్చుకునే స్థితిలో లేను. మా బంధువు బలవంతంమీద ఆ పుస్తకం తీసుకన్నాను.

చింతామణికి వచ్చాను. ఎం. ఎఫ్. జి. కాలేజీలో నా సహోద్యోగి,

కన్నడ ఉపన్యాసకుడు కె. నారాయణ స్వామితో కలిసి దిగంబర కవిత చదవ సాగాను. ఆయన మాతృభాష తెలుగే అయినా చదువంతా కన్నడంలోనే సాగింది. దిగంబ కవితను మళ్ళీ మళ్ళీ విమర్శనాత్మకంగా చదివేకొద్దీ మా ఇద్దరిలోనూ చాలా మార్పు వచ్చింది. అదే సమయంలో శ్రీ శ్రీ రచనల్ని మళ్ళీమళ్ళీ చదవడం తటస్థించింది. తెలుగు కవిత్వంలో అత్యాధునిక ధోరణుల్ని కన్నడానికి పరిచయం చేయాలనే ఆలోచన కలిగింది.

1971 సెప్టెంబర్ 23న నేను, నారాయణస్వామి దిగంబర కవితల్ని కన్నడానికి అనువాదం చేయడం మొదల పెట్టాము. దిగంబర కవుల మూడు సంకలనాలనుంచి ముప్పై కవితల్ని ఎంపిక చేసుకున్నాము. దిగంబర కవులైన నిఖిలేశ్వర్, చెరబండరాజు, నగ్నముని నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. హైదరాబాదులో అప్పుడప్పుడు వాళ్ళను కలిసే వాణ్ణి. మద్రాసుకు వెళ్ళినప్పుడల్లా శ్రీ శ్రీ ని కలిసేవాణ్ణి. ఈ కొత్త పరిచయాలు, రచనలు నా అంతరంగంలో మార్పుకు కారణమయ్యాయి.

అంత వరకు నేనెప్పుడూ గ్రాంథిక భాషనే రాశాను. పద్య కవిత్వాన్నే అభిమానించాను. ''ఓం శ్రీ వేంకటేశాయ నమః'' అని రాయందే ఏమీ రాసేవాణ్ణి కాదు. ప్రతిరోజూ తప్పక సంధ్యావందనం చేసే వాణ్ణి. సమకాలిక సాహిత్య ప్రభావం మనిషిని సమూలంగా మార్చగలదనడానికి నేనే నిదర్శనం. 1971-72 సంధి కాలంలో నా జీవితానికి, రచనలకు ఒక ధ్యేయాన్ని సమకూర్చుకున్నాను. దృఢమైన సంకల్పంతో నాదంటూ ఒక మార్గాన్ని ఎన్నుకున్నాను. 1971 డిసెంబరులో దిగంబరకవుల రచనల అనువాదాన్ని అచ్చుకు ఇచ్చాము. తెలుగులో దిగంబర కవులలాగానే నా పేరును రక్తాక్షి అని, నారాయణ స్వామి పేరును యుగాంతక అని మార్చుకున్నాము.

# 1972

జనవరి నెలలో దిగంబర కవిత కన్నడంలో సిద్ధమయింది. నేనూ కొత్త జీవితాన్ని ప్రారంభించాను. ఆరోజుల్లో నేను ఎంత మథన పడ్డానో, ఎన్ని రకాల సంఘర్షణలకు గురి అయ్యానో తలచుకుంటే ఇప్పటికీ ఆశ్చర్యం వేస్తుంది. శుద్ధశ్రోత్రియుడిలా ఉండిన నేను ఇంత మార్పుకు ఎలా గురి అయ్యానా అని పిస్తుంది. నగ్నముని రాసిన 'దెయ్యం దీవించాలి' కవితలో 'ఆ దేవుడుగాడు చచ్చాడు'' అనే వాక్యాన్ని అరిగించుకోవడానికి నాకు కొన్ని రోజులు పట్టింది. కొన్ని రోజలు నేను నిద్రపోకుండా ఆలోచించేవాడిని. జగద్గురువులను గురించిన కవితని అనువదించడానికి నేనేమీ బాధ పడలేదు. కాని 'బుద్ధుడా నువ్వానీక్షమ నాకక్కరలేదు. నువ్వొక్కడివే బోధివృక్షం కింద చావు' అనే మాటల్ని అనువదించేటప్పుడు చాలా బాధ పడ్డాను. బుద్ధుడన్నా, గాంధీజి అన్నా నాకు ఎంతో అభిమానం. అలాంటిది ఇంత కటువుగా రాయాల్సి వస్తోందే అని నేనెంతో విలవిల లాడిపోయాను. ఈ ఆలోచనలు నన్ను నిరంతరంగా వేధించేవి.

1972 జనవరి 30 నాడు గాంధీజీ హత్య జరిగిన సమయంలోనే కన్నడ దిగంబర కవితను బెంగుళూరు, మైసూరు, గుల్బర్గాలలో ఆవిష్కరించడం జరిగింది. దీని కోసం తెలుగులో దిగంబర కవులలాగే మేమూ కొంత హంగామా చేశాము. నేను, నారాయణస్వామి బెంగుళూరులో ఒక సామాన్యస్త్రీ చేత మురికివాడలో ఆవిష్కరింప జేశాము. అలాగే మిగిలిన చోట్ల కూడా మిత్రులు సమావేశాలు జరిపారు. ఈ సమావేశాలకోసం మేము వేసిన ఆహ్వాన పత్రిక గొప్ప సంచలనం కలిగించింది. అంతవరకు కర్నాటక రాష్ట్రంలో ఎవరూ ఇలాంటిది కనివిని ఎరుగరు. మా ఆహ్వాన పత్రికలో కొన్ని భాగాలు ఇలా ఉన్నాయి:

ఆవిష్కరణ సమావేశం
(అన్ని నగరాలలో ఒకే సమయంలో)
1972 జనవరి 30 నాడు సాయంత్రం 5 గంటలకు సరిగ్గా

| ఊరు : | స్థలం : | ఆవిష్కరించేవారు : |
|---|---|---|
| బెంగుళూరు : | శివాజి టాకీస్ ఎదురుగా న్యూమిషన్ రోడ్డులో ఉండే ఇంకంటాక్స్ భవ్య భవనం పక్కన ఉన్న మురికి ప్రదేశం | సమాజానికి బలియైన సామాన్య స్త్రీ |
| మైసూరు : | పురమందిరం పక్కనే ఉన్న ట్యాక్సీ స్టాండు | హోటల్ క్లీనర్ టి. ఎన్. చంద్రశేఖర్ |
| గుల్బర్గా : | మెయిన్ రోడ్ లో చెరువు పక్కనే మురికి వాడ (బగీచా) | హోటల్ సప్లయిర్ గోవింద |

''దిగంబర కవిత'' చదివితే 30 సార్లు మీ దేహంలో అణువణువున ఆవేశం పొంగి పొర్లుతుంది. మీ కళ్ళల్లోనుంచి నెత్తురు కన్నీరై కారుతుంది. సమాజంలో ఇప్పుడు జరుగుతున్న క్రూరమైన దొంగనాటకానికి తెరవేసేట్లు మిమ్మల్ని ప్రేరేపిస్తుంది''.

మేము బెంగుళూరులో జరిపిన సమావేశానికి అనుకోకుండా అపూర్వ ప్రచారం లభించింది. ఇలాంటి సమావేశాన్ని ఇప్పటి వరకు చూడలేదని ప్రముఖ పత్రికలు మొదటి పుటలో ప్రచురించాయి. ఒకటి రెండు పత్రికలు సంపాదకీయాలు, విశేష వార్తలు రాశాయి. అన్ని పత్రికల్లో సమీక్షలు వచ్చాయి. ప్రముఖ కాలమిస్టు, రచయిత డా. హా. మా.

నాయక్ దిగంబర కవితను గురించి చాలా విషయాలు రాసి 'కవిత దిగంబరంగానే ఉంది. కాని కవిత్వం కావలసి ఉంది' అని రాశారు. మమ్మల్ని గురించి కటువుగా విమర్శిస్తూ పత్రికలో 'కాలం' రాసిన హా. మా. నాయక్ గారే నన్ను చింతామణినుంచి మైసూరికి పిలిచి ఉద్యోగం ఇచ్చారు.

దిగంబర కవిత అనువాదం కర్నాటకంలో యువతమీద చాలా ప్రభావం చూపింది. దళితకవిత, బండాయ కవిత (తిరుగుబాటు కవిత) దిగంబర కవిత్వ ప్రభావానికి లోనయ్యాయి. కర్నాటకంలోని చాలా మంది కవులతో నాకు పరిచయం ఏర్పడింది.

దిగంబర కవిత తెలుగు కవితా వికాసంలో ఒక చారిత్రక పాత్రను నిర్వహించిందనడంలో సందేహం లేదు. శ్రీశ్రీ కవిత లాగే దిగంబర కవిత కూడా నాకు ముందు చూపును ప్రసాదించింది. కొత్తగా వచ్చిన దేన్నయినా అనుమానంతో కాక స్వాగత దృష్టితో చూడాలనే శ్రీశ్రీ అభిప్రాయం నాలో వేళ్ళు నాటుకుంది. దిగంబర కవి పరిమితులు నాకు తెలియక కాదు. కాని ద్రవస్థితిలో ఉన్న నా చిత్తాన్ని ఆ కాలంలో అది ఆకట్టుకుంది. దీనివల్ల నేను ఎంతో మంది బంధుమిత్రుల విమర్శకుగురి అయ్యాను. కాని నేను దేనినీ గుడ్డిగా అనుకరించలేదు. దిగంబరకవులు విప్లవ కవులుగా మారి తర్వాత ఎన్నెన్నో సంస్థల్లో చేరినా నేను మాత్రం అప్పటికీ ఇప్పటికీ ఏ సంస్థలోనూ చేరలేదు. నా పరిమితులేవో నాకు తెలుసు. ఒకప్పుడు మిత్రులంతా వారి వారి సంస్థల్లో చేరమని నన్ను ఎంతగానో అడిగారు. కాని నేను నమ్మిన దాన్ని చిత్తశుద్ధితో నా పరిమితుల మేరకు ఆచరిస్తూ వస్తున్నాను. ఏది ఆచరించినా ఆచరించక పోయినా, సంస్థలలో భాగం కాకున్నా మానవత్వం, సమానత్వం, ముందుచూపు మొదలైన వాటిలో నేను

రాజీపడలేదు. ఒకటి రెండుసార్లు నేను పొరపాటు చేసి ఉండవచ్చు. స్నేహ బంధం కోసం, కొందరికి ఇచ్చిన మాటకోసం, భాషా సాహిత్యాభిమానం కోసం కొన్ని విషయాల్లో తప్పటడుగులు వేసి ఉండవచ్చు. కాని 1972 నుంచి ముఖ్యంగా తీసుకున్న కొన్ని నిర్ణయాలను మాత్రం అమలుపరుచుకుంటూ వస్తున్నాను. ఇది నేను ఎంతో వేదనకులోనై అంతర్మథనానికిలోనై తీసుకున్నదే కాని హఠాత్తుగా తీసుకున్నది కాదు. ఈ నేపథ్యంలో నేను యజ్ఞోపవీతాన్ని ఆనాడే విసర్జించాను. మూఢ సంప్రదాయాలన్నిటికీ స్వస్తి చెప్పాను. మానవాతీత శక్తులను నా మనసులోంచి శాశ్వతంగా దూరం చేశాను. జాతి మతాల పరిమితులకు మంగళం పాడేశాను. అప్పటినుంచి ఇప్పటివరకు ఈ విషయాలలో ఏనాడూ నేను నా మనసుకు వ్యతిరేకంగా వెళ్ళలేదు.

అయితే ఇక్కడ ఒక విషయం చెప్పాలి. నేను ఎప్పుడూ సంస్కృతికి విరుద్ధంగా ప్రవర్తించలేదు. నా సొంత అభిప్రాయాలు ఇతరులను బాధిస్తాయని, వేదనకు గురిచేస్తాయని స్పష్టమైతే అలాంటప్పుడు సుసంస్కృతుడిలాగా ప్రవర్తించాను. నా సొంత అభిప్రాయాలను ప్రచారం చేసి నేనేదో గొప్ప త్యాగం చేస్తున్నాననో, సంస్కరణ తెస్తున్నానో చాటుకోవడం నాకిష్టంలేదు. అందుకనే శ్రీశ్రీ 'సదసత్సంశయం' చెందడం, తనకు దేవుడిమీద నమ్మకం ఉందా లేదా అనే విషయాన్ని గూర్చి మళ్ళీ మళ్ళీ రాస్తుండడం నాకు నచ్చేది కాదు. ఇది అసలు పట్టించుకోవలసిన విషయం కాదనిపించేది.

ఇదే సందర్భంలోనే నా మీద అపారమైన ప్రభావం చూపిన మహనీయుల్ని స్మరించుకోవాలి. అలాంటి వారిలో గోరా (గోపరాజు రామచంద్రరావు) గారొకరు. వారి పుస్తకాలు చదివి నేను చాలా ప్రభావం పొందాను. వారి 'Atheist' పత్రికను తెప్పించి చదివేవాణ్ణి. రాహుల్

సాంకృత్యాయన్ నన్ను గొప్పగా ప్రభావితం చేశాడు. ఆయన స్వయంకృషి, విద్వత్తు, లోకానుభవం నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయి. కందుకూరి ఆత్మ చరిత్ర నా మీద చూపిన ప్రభావం అంతా ఇంతా కాదు. సాహిత్యంలోను సమాజంలోను కందుకూరి పాత్ర నా రచనలకు, జీవితానికి కూడా దారి దీపమయింది. వి.ఆర్.నార్లగారి మేధస్సు, పుస్తక సేకరణ నన్ను ఆకట్టుకున్నాయి. ఆయన మైసూరులో "Poverty of Intellectualism in India" అనే పేరుతో ఉపన్యాసాలు ఇచ్చారు. అవి నాకు దృఢసంకల్పాన్నిచ్చాయి. వావిలాల గోపాలకృష్ణయ్యగారి సరళ జీవితం, నిజాయితీ నాకు బుద్ధులు నేర్పాయి. మదర్ థెరిసా, బాబా ఆమ్టే సమాజసేవ, కారుణ్యం నాలో పులకరింతలు తెస్తుంటాయి. 1972 నుంచి ఈనాటివరకు సాగిన నా జీవితం, రచనలు ఈ నేపథ్యంలో మలుపు తిరిగినందువల్లే ఇంతగా చెప్పవలసి వచ్చింది.

అప్పటినుంచి ఇప్పటివరకు నేను మళ్ళీ గ్రాంథిక భాషలో రచన చేయలేదు. ఏనాడూ కులాన్ని, మతాన్ని, మూఢవిశ్వాసాల్ని, మానవాతీతశక్తుల్ని సమర్థిస్తూ రాయలేదు. కొన్ని కారణాలవల్ల ఒకటి రెండు ఆధ్యాత్మిక రచనల్లాంటివి చేయవలసి వచ్చినా మూఢ సంప్రదాయాలకు బద్ధుణ్ణి కాలేదు.

## ఆలిచిప్పలు - ఆణిముత్యాలు

ఇది మేము ప్రచురించిన మొదటి జానపద గేయసంకలనం (నేను, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, డా. తంగిరాల వెంకట సుబ్బారావు). జానపద సాహిత్యంలో పరిశోధనకు పూనుకున్న నాటినుంచి ఆ క్షేత్రంలో అనేక గ్రంథాలను ప్రచురించడానికి ప్రణాళికలు వేసుకున్నాను నేను. కన్నడంలో చక్కని పీఠికలతో ఉత్తమ గేయాలను, ఇతర ప్రక్రియలను

ప్రచురించడం చూశాను. జానపద గేయాల ప్రచురణకు ఒక పద్ధతిని సూచించాలనే ఉద్దేశంతో 'ఆలిచిప్పలు - ఆణిముత్యాలు' ప్రచురించడం జరిగింది. అప్పటికీ ఇప్పటికీ శాస్త్రీయంగా తెలుగులో వెలువడిన ఉత్తమగేయ సంకలనాలలో 'త్రివేణి' ని చెప్పుకోవాలి.

'ఆలిచిప్పలు - ఆణిముత్యాలు' చిన్న పుస్తకమైనా ఒక పద్ధతిలో వెలువడిన సంకలనం. ఇందులో 32 పాటలున్నాయి. అవి వివిధ రకాల పాటలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. మొట్టమొదటిసారి అశ్వత్థ నారాయణ గారు సేకరించిన 56 కపిలి పదాలను ప్రచురించాము. పుస్తకానికి 16 పుటల ప్రస్తావన నేనే రాశాను. చివర లఘుటీక ఇచ్చాం. సంపాదకులమైన ముగ్గురమూ సేకరించిన పాటలు ఈ సంకలనంలో ఉన్నాయి. ఈ పుస్తకం రాతప్రతిని నేను, అశ్వత్థనారాయణగారు మద్రాసుకు తీసుకువెళ్ళి ఫ్రీడమ్ ప్రెస్సులో ఇచ్చాం. దసరా సెలవుల్లో పాన్నేరినుంచి రోజూ మద్రాసు వెళ్ళి ఆలిచిప్పలు అచ్చువేయించాను. 1972 నవంబరులో పుస్తకం వెలువడింది.

## 1973

ఈ సంవత్సరం నా పుస్తకమేమీ వెలువడలేదు కాని అచ్చుకు సిద్ధం చేయడం జరిగింది. నేను, నారాయణ స్వామి కలిసి కన్నడంలో యు.ఆర్. అనంతమూర్తి రాసిన ప్రసిద్ధ నవల 'సంస్కార' తెలుగులోకి అనువదించాము. ఈ సంవత్సరమే నాకు పిహెచ్.డి. డిగ్రీ లభించింది. వ్యావహారిక భాషలో రాసి పిహెచ్.డి. పొందిన మొట్టమొదటి సిద్ధాంత గ్రంథం నాది. అంతకు ముందే కొంతమంది వ్యావహారిక భాషలో చేయడానికి పూనుకున్నారు కాని నేనే ముందుగా రాసి పిహెచ్.డి.

పొందిన వాడినయ్యాను. వ్యావహారికంలో రాయడానికి ఒప్పుకున్న నా మార్గదర్శకులు కె. సుబ్బరామప్పగారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నాకు వచ్చిన తర్వాత డా. మద్దూరి సుబ్బారెడ్డి, డా. కొలకలూరి ఇనాక్, డా. వెల్చేరు నారాయణరావు, డా. కేతు విశ్వనాథరెడ్డి గార్లకు డిగ్రీలు లభించాయి. తర్వాత వ్యావహారిక భాషలో వందలకొద్దీ సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి.

1973 లోనే నేను మైసూరు విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకునిగా చేరాను. చింతామణిలో నాలుగున్నర సంవత్సరాలు నేను, కె. నారాయణస్వామి గారు ఎప్పుడూ సాహిత్య కార్యక్రమాలలో నిమగ్నులమై ఉండే వాళ్ళం. మా యిద్దరి స్నేహం వల్లనే నాకు కన్నడంతో బాగా పరిచయం ఏర్పడింది. 1973లోనే కన్నడ ఎం.ఎ.కి కూడా ప్రయివేటుగా నేను చదవడానికి చింతామణిలో నా మిత్రులు చాలా దోహదం చేశారు. కన్నడంలో జాగా రాయడానికి నా చింతామణి ఉద్యోగం ఉపయోగపడింది.

మైసూరులో. చేరడంవల్ల జానపద సాహిత్యంలో విశేషంగా కృషి చేయడానికి వీలుకలిగింది. నేను వెళ్ళగానే అక్కడ జానపద విజ్ఞానంలో ఎం.ఎ. తరగతులు ప్రారంభమయ్యాయి. దేశంలో మరెక్కడా లేని కోర్సు మైసూరులో ప్రారంభమై నేను బోధకుడిగా ఉండడం వల్ల నాకెంతో లాభించింది.

1973 లోనే నేను, దుప్పటి సుబ్రహ్మణ్యం, అనంత అనే ముగ్గురం కలిసి 'ప్రజా కవిత' పేరుతో ఒక కవితా సంకలనాన్ని ప్రచురించాలనుకున్నాం. దిగంబర కవితలాగే ఒక కొత్త కవితా మార్గాన్ని నిర్దేశించాలని మా మహదాశయం. కాని దానికి పురిటిలోనే సంధికొట్టింది. సంకలనాన్ని సిద్ధంచేసి పీఠికలకోసం కొందరు ప్రసిద్ధకవులకు పంపాము. శ్రీశ్రీ గారు పీఠిక రాశారు. అది సుబ్రహ్మణ్యం దగ్గరే ఉండి పోయింది.

నేను మళ్ళీ దాన్ని అతని నుంచి సంపాదించలేకపోయాను. మరో మున్నుడిని పఠాభిగారు రాశారు. అది ఈనాటికీ నా దగ్గరే ఉంది.

ప్రజలకోసం ప్రజల తరఫున
ప్రజలతో గొంతుకలిపి
పలికేదే ప్రజాకవిత్వం.
సుందరం సుబ్రహ్మణ్యం
అనంత
వీళ్ళ కవిత్వం
అటువంటిది.
కాలయాపనకు కాదు
ఈ పద్యాలు
నడుం కట్టి
కార్యరంగంలో దూకి
పోరాడుటకు
ప్రోత్సాహమిచ్చే
ఈ పుస్తకాన్ని
నేనాహ్వానిస్తున్నాను.

అన్నారు పఠాభి.

అనుముల కృష్ణమూర్తిగారు 'కిరసనాయిలు' అనే పేరుతో చాలా మంచి కవితారూప పీఠికను రాశారు. అందులో కొన్ని వాక్యాలిలా

ఉన్నాయి:

''దగా పడిన తమ్ముళ్ళందరూ మొగాళ్ళై ఐతే

ఈనాటి కవిత తరహా ఉండేది మరో తీరుగా''

''ఇదొక త్రివేణి.

సుందరానంత సుబ్రహ్మణ్యాలు

ప్రజాకవితా భాగీరథిగా ప్రవహిస్తున్నారు

ఇదొక త్రిశృశృంగం.

ఒక రావణ మహాకాష్టానికి

కవి ధనం - కవితా ఇంధనం అర్పితమౌతున్నది.

నీ కోయిలసైతం కొంత కిరసనాయిలు పుక్కిలించింది''.

అప్పటికీ ఇప్పటికీ ప్రజాకవితను ప్రమరించే ప్రయత్నం చేయలేదు నేను.

# 1974

యు.ఆర్. అనంతమూర్తి గారి 'సంస్కార' ఒక సంచలనాత్మక నవల. కన్నడంలో దీన్ని మన పఠాభిగారు సినిమాగా తీశారు. కన్నడ చలనచిత్రాలకు జాతీయస్థాయిలో మొట్టమొదటి బంగారు పతకం లభించింది. నాకు పఠాభిగారు బెంగుళూరులో పరిచయమయ్యారు. ఎన్నో సార్లు వారి శ్రీమతి స్నేహలతా రెడ్డిగారి ఆతిథ్యాన్ని చవిచూచాను. అప్పట్లోనే పఠాభిగారి 'ఫిడేలు రాగాల డజన్'ను నెల్లూరు వర్ధమాన

సమాజం వారు మళ్ళీ ప్రచురించారు. 'సంస్కార' నవలను తెలుగులోకి అనువదించడానికి, 'రాగాల డజన్'ను కన్నడానికి అనువదించడానికి పఠాభిగారితో నా పరిచయమే కారణం.

నేను చింతామణిలో ఉండగానే 'సంస్కార' నవల అనువాదాన్ని పూర్తిచేశాను. దీని ముద్రణ విషయంలో నాకు కొన్ని అనుభవాలు ఎదురయ్యాయి. ఇప్పటి వరకు నా పుస్తకాలన్నిటినీ మద్రాసులో ఫ్రీడమ్ ప్రెస్‌లోనే ముద్రించాను. అనంతమూర్తిగారి 'సంస్కార' ను ఎవరైనా ప్రచురణకర్తలకు ఇద్దామనుకున్నాం. నవోదయ వారికి రాశాను. రామమోహనరావుగారు 15% రాయల్టీ ఇచ్చి ప్రచురించడానికి కూడా అంగీకరించారు. కాని మా దురదృష్టం కొద్దీ గుంటూరులోని 'కర్నాటక సేవాసమితి' అనే వారితో పరిచయమయింది. వారు అంతకుముందే 'వంశవృక్షం' నవలను ప్రచురించి దాన్ని పెద్ద ఎత్తున గుంటూరులో ఆవిష్కరించారు. కన్నడ నవల అనువాదాన్ని అలాంటి సంస్థకు ఇవ్వడమే మంచిదనుకొని ఇచ్చాం. ఆ మహానుభావులు 'సంస్కార' ను అతి సామాన్యంగా ముద్రించడమే కాకుండా అన్ని ప్రతులనూ గోనె సంచులలో సమాధిచేసి ఎవరికీ అందుబాటులో లేకుండా చేశారు. అతికష్టంమీద నాకు రెండు కాపీలను, నారాయణ స్వామి గారికి రెండు కాపీలను మాత్రం సంపాదించగలిగాం. మాకుగాని, మూలగ్రంథ రచయితకు గాని ప్రచురణ కర్తలు ఒక్క పైసా కూడా ఇవ్వలేదు. దీనివల్ల యు.ఆర్. అనంతమూర్తిగారి మందలింపుకు కూడా మేం గురికావలసి వచ్చింది. ఇదో చేదు అనుభవం.

'సంస్కార' నవల వచ్చిందని తెలిసి కొందరు మాకు ఉత్తరాలు కూడా రాశారు. కాని అసలు ప్రతులే వెలుగులోకి రాలేదు కదా! అలా ఆసక్తి కనబరచిన వారిలో రంగనాయకమ్మ గారొకరు. నేను

పంపిన 'సంస్కార' నవలను చదివి ఇలా ఉత్తరం రాశారు (23 - 6 - 1977).

"మీ 'సంస్కార' నవల అప్పుడే అందింది. నేను చదివాను, మా ఫ్రెండ్స్ చదువుతున్నారు. అనువాదం చాలా వరకు సహజంగానే వుంది. తెలుగుతో మీకు మంచి పరిచయం వున్నట్టు అర్థమవుతోంది''. నేను కర్నాటకలో చాలాకాలం నుంచి ఉండడంవల్ల నేను కన్నడిగుడిననే నమ్మకం కొంతమందిలో బలపడిపోయింది. ఆ నమ్మకంతోనే రంగనాయకమ్మ గారలా రాశారు. 'సంస్కార' చదవాలని ఆసక్తి చూపించిన కొందరికి ఇలాగే నా దగ్గరున్న ప్రతినే పంపి మళ్ళీ తెప్పించుకోవలసి వచ్చింది.

# 1975

'సంస్కార' నేర్పిన అనుభవం వల్ల అనువాదాలను చేసి ప్రచురించే కార్యం ఎప్పటికీ చేయకూడదని అనుకున్నాను. కాని అడపాదడపా చెయ్యక తప్పడం లేదు. దీనివల్ల నేను సొంతంగా రాయాలనుకున్నవెన్నో రాయలేకపోయాను.

మైసూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థలో ఎస్. చన్నప్ప అని నా స్నేహితుడున్నాడు. ఆయన చిన్న పిల్లల కోసం చాలా పుస్తకాలు రాశారు. వాటిలో 'కువెంపుకథె' ఒకటి. కన్నడ మహాకవి, జ్ఞానపీఠ ప్రశస్తి విజేత అయిన కె.వి. పుట్టప్పగారిని గురించిన వివరణమది. దాన్ని తెలుగులోకి అనువదిస్తే తానే ప్రచురిస్తానని అన్నారు ఎస్. చన్నప్ప. మహాకవి కె.వి. పుట్టప్పగారిని గురించి తెలుగు వారికి తెలిపినట్లుంటుందని నేను అందుకు ఒప్పుకున్నాను. అంతకంటె ముఖ్యంగా

స్నేహధర్మంవల్ల నేనీపని చేశాను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారికి ఆ పుస్తకాన్ని పంపి కొంత సహాయ ధనాన్ని కూడా చన్నప్పగారికి ఇప్పించాను. 'పుట్టప్పకథ' ను మద్రాసులోని ఫ్రీడమ్ ప్రెస్సులోనే అచ్చువేయించాను.

'పుట్టప్ప కథ'ను గురించి రాళ్ళపల్లి వారిలా రాశారు (21-4-76)

''పుట్టప్ప కథ భాషాంతరీకరణమైనా తెలుగులో ధారాళంగా చదువుకోదగినదిగా నున్నది. చిన్న పిల్లలకోసం వ్రాసినదయినా ఆయన స్వవిషయమెక్కువగా తెలియని పెద్దవారికీ అది ఉపకారకమే. కాని ఇందులో ఆయన భార్యాసంతానములను గూర్చిన విషయాలు లేకపోవడం కొరతగా తోస్తుంది. ప్రబుద్ధుల కోసమే ప్రత్యేకంగా పెద్ద పుస్తకం వ్రాసేది మేలు. ఒకవేళ అదికూడా ఎవరైనా చేసే వున్నారేమో !''

## ఆకాశగంగ

అనుపమానిరంజన అని కన్నడంలో గొప్ప రచయిత్రి ఉండేవారు. ఆవిడ జీవితం ఒక మహాకావ్యం. వృత్తి రీత్యా డాక్టరు సుబ్బమ్మ అనుపమగా మారి నిరంజన అనే మరో ప్రఖ్యాత రచయితను వివాహం చేసుకున్నారు. ఇద్దరూ ఆధునిక కన్నడ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. ఒకసారి వారింటికి మిత్రుడు హరిహర ప్రియతో వెళ్ళాను. అనుపమ గారితో కలిగిన పరిచయం వల్ల ఆవిడ రాసిన నవల ఏదైనా తెలుగులోకి అనువదిద్దామనే ఆలోచన కలిగింది. నేను వారింటికి వెళ్ళినపుడు 'ఆకాశగంగె' అనే నవలను ఇచ్చారావిడ. చదివితే నాకు బాగా నచ్చింది. ఒక రచయిత సమకూర్చుకోవలసిన వస్తుసామగ్రిని నవలారూపంలో చెప్పే రచన. బ్రహ్మాండమైన నవల కాకున్నా వస్తువు

చాలా ఉదాత్తమయినదనిపించింది. అనువాదం చేశాను.

'ఆకాశగంగ'ను ప్రచురించాల్సిందిగా ఒకరిద్దరు ప్రచురణకర్తల్ని కోరాను. తిరుపతిలో బాలాజీ పబ్లిషర్స్ అనే ప్రచురణ కర్తలు పదిశాతం రాయల్టీ ఇస్తామని చెప్తే డా. అనుపమ అంగీకార పత్రం రాసి పంపారు. తనకు ఐదు ప్రతులు ఇవ్వాలని, అనువాదకుడిని ప్రోత్సహించేందుకు గౌరవధనంలో 75% తీసుకోవచ్చని రాశారు. బాలాజీ పబ్లిషర్స్ వారు కాపీరైట్ కూడా తమకే ఇమ్మని అడగడం వల్ల నేను పుస్తక ప్రచురణకు అంగీకరించలేదు. నవలను 'జ్యోతి' మాసపత్రిక వారికి పంపాను. 'ఆకాశగంగ' జ్యోతి సప్లిమెంట్‌గా 1975 ఆగష్టులో వచ్చింది. జ్యోతివాళ్ళు నాకు రూ. 200 మాత్రం ఇచ్చారు. నేను వారికి సగం డబ్బుమూల రచయితకు పంపాలని, 5 కాపీలు పంపాలని స్పష్టంగా రాశాను. కాని అలా జరగలేదు.

డా. అనుపమ 2 - 4 - 76న నాకో ఉత్తరం రాశారు. అందులో సారాంశం ఏమిటంటే— ''మీరు జ్యోతి పత్రికకు పంపేముందు నా అనుమతి అడగాల్సింది. సమ్మతి పత్రం లేకుండా వారనలు ఎలా ముద్రించారు? ప్రతులెన్ని? ఇవన్నీ తెలుసుకోకుండా 200 రూపాయలకే మీరెలా ఇచ్చారు? మామూలుగా అనువాదకులకు 'ఫీ' మాత్రం ఇస్తారు. నేను నా పుస్తకాలను అనువదించిన వారందరికీ నాకు వచ్చిన డబ్బులో సగం ఇస్తూ వచ్చాను. నా నవల 'స్నేహపల్లవి' తెలుగులోకి అనువాదమైతే అలాగే చేశాను. మీకు వచ్చిన దానిలో సగం నాకు రావాలి. ఇది డబ్బు ప్రశ్నకాదు. నియమం. ఇది మూల రచయిత హక్కుకు సంబంధించింది. మీరు తెలిపినట్లు ఆకాశగంగ ప్రతులు ఐదు రూ. 100 పంపించండి''.

నాకు ఏమిటోగా అనిపించింది. అనువాదాలు చేసి, వాటిని

ప్రచురించడానికి నానా పాట్లు పడి చివరికి ఇలాంటి నిష్ఠూరాలను కూడా ఎదుర్కోవడం ఎందుకు అని బాధపడ్డాను. జ్యోతి సప్లిమెంటు శోభనబాబు ముఖచిత్రంతో జనప్రియ పత్రికకు తగినట్లే ఉంది. తమ పుస్తకాలను అందంగా ముద్రించుకునే అనుపమగారు దీన్ని ఎలాగూ మెచ్చరని తెలుసు. అయినా కాపీలు, డబ్బు పంపాను.

మరో ఆరు నెలల తర్వాత డా. అనుపమ నిరంజనగారి దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. దాని విషయం చెప్పడానికే ఈ కథంతా.

''మీరు పంపిన డబ్బు ఆనాడే అందుకున్నాను. మొన్న పాత ఉత్తరాలు తిరగేస్తుంటే నేను లోగడ రాసిన ఉత్తరంలో మీకు 75% గౌరవధనం ఇస్తానని రాసినట్లు తెలిసింది. పొరపాటున మీ వద్ద వందరూపాయలు తీసుకున్నాను. మీకు న్యాయంగా రూ. 150 చెందాలి. అందువల్ల రూ. 50 కి చెక్ పంపిస్తున్నాను'' అని రాశారావిడ.

ఆవిడ నిజాయితీకి ఆశ్చర్యం వేసింది. ఇవన్నీ జీవితం నేర్పిన పాఠాలు. డా. అనుపమగారి మీద నాకుండే గౌరవం ఇనుమడించింది. తర్వాత ఆవిడరాసిన ఆత్మకథ 'నెనపినల్లి సిహి - కహి' (జ్ఞాపకాలలో తీపి, చేదు) చదివి చలించిపోయాను. సామాన్య కుటుంబంలోని ఒక స్త్రీ స్వయంకృషితో మహారచయితగా, డాక్టర్‌గా, సమాజసేవకు రాలిగా ఎలా రూపొందిందో ఆ పుస్తకం వల్ల తెలుస్తుంది.

## 1976

పతాభిగారితో పరిచయమైన తర్వాత అప్పుడప్పుడూ వారింటికి వెళ్ళేవాణ్ణి. బెంగుళూరికి ఎప్పుడు వెళ్ళినా తప్పక ఆయనతో సమకాలీన

తెలుగు సాహిత్య వాతావరణాన్ని గూర్చి చర్చించేవాణ్ణి. అప్పట్లో పఠాభిగారు "ది సౌండ్స్ ఆఫ్ మ్యూజిక్" లాగా పూర్తి సంగీత ప్రధానమైన చిత్రం తీద్దామనుకున్నారు. దానికి రచన చేయమని నన్నడిగారు. కన్నడంలో 'సంగ్యాబాళ్యా' అనే జానపద సంగీత రూపకం ఉంది. దాన్ని సుమారు 30 పాటలలో రాసి తెలుగు స్క్రిప్టు తయారుచేశాను. ఆ రోజుల్లో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం సినిమాలకు ధనసహాయం ఇచ్చి కొన్ని గొప్ప సినిమాలను తీయించింది. కాని అక్కడి ప్రభుత్వం పడిపోవడంతో పఠాభిగారి సినిమా, నా స్క్రిప్టు మూలబడ్డాయి. ఆ రోజుల్లోనే కేంద్ర ప్రభుత్వ స్వర్ణ పతకం పొందిన 'కాడు' (తెలుగులో 'అడివి' పేరుతో ఎమెస్కోవారు నవలను ప్రచురించారు) అనే చలనచిత్రం స్క్రిప్టును కూడా దాని రచన ఆలనహళ్ళి కృష్ణ కోరిక మేరకు అనువదించాను. ఆ సినిమాను డబ్ చేయించాలని కృష్ణ చాలా ప్రయత్నించారు. కాని అది వీలుకాలేదు.

పఠాభిగారు తెలుగులో తీయాలనుకున్న సినిమాలు ఆరంభంలోనే ఆగిపోయాయి. అది నా దురదృష్టంకాదు, తెలుగువారి దురదృష్టం. 'ఇప్పుడు వీస్తున్నగాలి' (సి.ఎస్. రావుగారి కథ) సినిమా కోసం కూడా నేను రచన చేశాను. అదీ అలాగే ఉండిపోయింది. శ్రీశ్రీ 'ఆకలి మంటలు' అనే పేరుతో ఒక సినిమా కథ రాశారు. దాన్ని సినిమాగా తీద్దామని పఠాభిగారు అనుకున్నారు. దానికి స్క్రీన్‌ప్లే రాశాను. అది ఇంకా నా దగ్గర అలాగే ఉంది. ఇలా చలనచిత్ర రంగంలోకి నా ప్రవేశం ఆదిలోనే ఆగిపోయింది.

ఘంటసాల బలరామయ్యగారు మా సమీప బంధువులు. చాలా సినిమాలకు సహాయక దర్శకులుగా పనిచేసిన ఘంటసాల చిరంజీవి (బలరామయ్య గారి తమ్ముని కొడుకు) నన్ను సినిమాల్లోకి తీసుకురావాలని

చాలా ప్రయత్నించారు. అలాంటప్పుడే సింగీతం శ్రీనివాసరావుగారితో పరిచయమయింది. ఆయన కందుకూరి వీరేశలింగం గారి మీద పూర్తి ఫీచర్ ఫిల్మ్ తీస్తానని, నన్ను రచన చేయమని అడిగారు. అదే అదనుగా నేను కందుకూరి పుస్తకాలన్నీ చదివాను. నా మీద కందుకూరి ప్రభావం బలపడింది. నాకెంతో లాభించింది. కందుకూరి జీవితాన్ని చలనచిత్రం కోసం సుమారు 30 - 40 దృశ్యాలలో దించాను. అయితే అప్పటికీ ఇప్పటికీ నా స్క్రిప్టును సింగీతం గారు అడగనూ లేదు నేను పంపనూ లేదు.

ఇలా కొన్నాళ్ళు సాగిన నా చలనచిత్ర సంబంధం ఎప్పుడో ముగిసిపోయింది. ఆ తర్వాత నాకు ప్రయత్నించే ఓపికగాని, ఉత్సాహంగాని లేకపోయాయి. దాని కోసమే మద్రాసు చుట్టూ తిరగడం నాకిష్టం లేకమానేశాను.

అయితే పఠాభిగారిలాంటి వారితో పరిచయం చలన చిత్రాలకు అతీతమైంది. శ్రీశ్రీ అయినా ఆరుద్ర అయినా దాశరథి అయినా నారాయణ రెడ్డిగారయినా అంతేకదా. అందుకే వారితో పరిచయాలు సాహిత్యపరంగానే బలపడ్డాయి.

## ఫిడేలు రాగాల డజన్

నెల్లూరి వాళ్ళు ఎక్కడున్నా అభిమానం చూపించుకుంటారు. ఏ ప్రాంతం వారయినా అంతే కదా. పఠాభిగారిదీ మా ఊరే అనుకోవడంతో ఒక అభిమానం ఉంది. బెజవాడ గోపాల రెడ్డిగారికీ నా మీద ప్రత్యేకమైన అభిమానం. 'రాగాల డజన్'ను సుందరం కన్నడంలోకి అనువదించాడు

అని అప్పుడప్పుడూ అభిమానంతో చెప్తూనే ఉంటారు.

'ఫిడేలు రాగాల డజన్' కన్నడం వారికి నచ్చుతుందని నాకు అనిపించింది. టి.ఎస్. ఎలియట్ ప్రభావం కన్నడ నవ్యకవులమీద అపారంగా ఉంది. నగరజీవిత చిత్రణను, అభివ్యక్తిలో నవ్యతను వారు అభిమానిస్తారు. పఠాభిని కన్నడానికి పరిచయం చెయ్యనక్కరలేదు. 'సంస్కార' నిర్మాతగా ఆయన సుపరిచితులే. కాని కవిగా ఎవరికీ పరిచయం కాలేదు.

పఠాభి కవితల్ని అనువాదం చేసి కన్నడంలో ప్రముఖ విమర్శకులైన జి.హెచ్. నాయక్ గారికి ఇచ్చి చదవమన్నాను. ఆయనకు చాలా 'ఖుషీ' అనిపించింది. ఆయన సామాన్యంగా ఎవరినీ మెచ్చుకోరు. కాని 'నవ్యకవిత' అంటే ఇలాగే ఉండాలి అన్నారు. నాకు ధైర్యం వచ్చింది. కన్నడరాగాల డజన్‌కు యు.ఆర్. అనంతమూర్తి గారిచేత మున్నుడి రాయించాలని నా అభిప్రాయం. పఠాభిగారికీ ఇదే ఇష్టం. అనంతమూర్తిగారు కన్నడ, ఇంగ్లీషు రచయిత, విమర్శకులు (ప్రస్తుతం కేంద్ర సాహిత్య అకాడెమీ అధ్యక్షులు).

ఫిడేలు రాగాల డజన్‌కు ప్రచురణ కర్తలు చాలా సులభంగానే దొరికారు. అపురూపమైన పుస్తకాలను మాత్రం అచ్చువేసే దేవేగౌడ (నెలమనె ప్రకాశన) 'కాడు' రచయిత ఆలన హళ్ళి కృష్ణ ద్వారా పరిచయమయ్యారు. నేను అడిగిన వెంటనే పుస్తకం అచ్చువేస్తామని ఒప్పుకున్నారు. పఠాభిగారి పుస్తకం, యు.ఆర్. అనంతమూర్తి పీఠిక - అచ్చుకాక ఏం చేస్తుంది. ఈ విషయంలో పఠాభిగారు కూడా ప్రయత్నాలు చేశారు. ఆయన రాసిన ఉత్తరం ఈ విషయాన్నే తెలుపుతుంది (27 - 8 - 74) :

"Regarding the Translation of రాగాల డజన్ Kindly include

the Introduction by Sri Sri as well as my note for the second edition. You shoud also write a translators note. Do you think it will be a good idea to get an introduction by Ananta Murthy. He said he liked my poem on Sita. If you want me, I can write to him.

You were expecting a publisher to take interest. Was it successful? If not, I can try some other publisher for you. Please let me know".

ఈ ఉత్తరం ఆయన 74 ఆగష్టులో రాశారు. నేను అప్పటికే అనువాదం సిద్ధం చేశాను. మరో రెండు మూడు నెలల్లో అచ్చుకు కూడా వెళ్ళింది. మైసూరులో గొప్ప ప్రెస్ అది; 'మైసూర్ ప్రింటింగ్ అండ్ పబ్లిషర్స్'? వారెప్పుడూ పదిపదిహేను పుస్తకాలు అచ్చువేస్తూనే ఉంటారు. ఆ రద్దీలో నా రాగాల డజన్ అచ్చు కావడానికి సంవత్సరం పట్టింది.

రాగాల డజన్‌కు కన్నడంలో మంచి ప్రతిస్పందన వచ్చింది. అనంతమూర్తిగారు తమ పీఠికలో పఠాభి గురించి చక్కని అంచనా వేశారు. "పాటలు పాడుకునే సంప్రదాయాన్ని ఇంకావదిలిపెట్టమని తెలుగు సాహిత్యంలో ఈ 'అకావ్యం' లాంటి పఠాభి వచన పద్యాలు ఇప్పటికీ విప్లవాత్మకమైనవే అయి ఉండాలి" అని ఊహించారు. 1939లో ఇలాంటిది కన్నడంలో వచ్చిఉంటే అదో బాంబులాంటిది అయ్యేదన్నారు. "పఠాభికి సుందరం కంటె మంచి అనువాదకుడు కన్నడంలో బహుశా దొరకడు" అని రాశారు.

# జానపద సాహిత్య స్వరూపం

నన్ను తెలుగు జానపద విజ్ఞాన క్షేత్రంలో నిలబెట్టిన మొదటి పుస్తకమిది. 1973లో పిహెచ్.డి. తీసుకున్నా సిద్ధాంత వ్యాసాన్ని అచ్చువేసే స్తోమత లేక ఊరుకున్నాను. కాని జానపద విజ్ఞానం, సాహిత్యం గురించి నేను తెలుసుకున్నవి, రూపొందించుకున్నవి, సమన్వయం చేసుకున్నవి లోకానికి తెలియడం లేదనే బాధ పీడించసాగింది. అందుకే జానపద సాహిత్యంలోని ముఖ్యమైన శాఖలకు సంబంధించిన నిర్వచనాదులు, ఉత్పత్తి, విభజన, పరిశోధన మొదలైన శాస్త్ర విషయాలను గురించి తెలుగులో మొట్టమొదటి పుస్తకం రాశాను. నా మొదటి రెండు పుస్తకాలకు మంగళాశాసనం పలికిన మా గురువుగారు ఆచార్య సాళ్వ కృష్ణమూర్తిగారే ఈ పుస్తకానికి మంగళాశాసనం రాశారు. ఎప్పుడూ వ్యావహారిక భాషలో రాయని సాళ్వగారు నా కోసం పీఠికను వ్యావహారికంలో రాయడం విశేషం. నేను అప్పటికే జానపద సాహిత్యంలో పరిశ్రమించడం వారికి చాలా ఆనందాన్ని కలగజేసింది. నా పుస్తకంలో 'అభిరుచి, అనుభవం, పరిశ్రమ' కనిపిస్తున్నాయని ఆశీర్వదించారు.

క్రితంలాగే ఈ పుస్తకాన్ని కూడా మద్రాసుకువెళ్ళి ఫ్రీడమ్ ప్రెస్‌లో అచ్చువేయించాను. రామరాజుగారు, దొణప్పగారు ఇంకా జానపద విజ్ఞానంలో కృషిచేసిన అనేకులు నా కృషిని గుర్తించారు. చాలా విశ్వవిద్యాలయాలలో జానపద సాహిత్యం చదువుకునే విద్యార్థులకు దాన్ని సంప్రదింపు గ్రంథంగా చేశారు.

తెలుగులో రాసేటప్పుడే జానపద సాహిత్య స్వరూపాన్ని కన్నడంలో కూడా రాశాను (జానపద సాహిత్యద మూలతత్వగళు' అనే పేరుతో). కన్నడంలో కూడా అలాంటి పుస్తకం అంతవరకు రాలేదు. గేయాలు,

కథలు, వ్యాసాలు మొదలైనవి వచ్చాయి కాని జానపద సాహిత్యాన్ని శాస్త్రీయ దృష్టితో విశ్లేషించే పుస్తకాలు రాలేదు. భారతదేశంలో మొట్టమొదటి జానపద విజ్ఞానాచార్యుడు డా. జె.ఎస్. పరమ శివయ్య. ఆయన, నేను మొదటినుంచి మైసూరులో ఫోక్‌లోర్ ఎం.ఎ. వారికి పాఠం చెప్తున్నాము. మైసూరులోనే నా సహోద్యోగి డా. రామేగౌడ కన్నడ జానపద సాహిత్యంలో గొప్ప కృషి చేశారు. పై ఇద్దరూ నా కన్నడ పుస్తకాన్ని గురించి అభిప్రాయాలు రాశారు. మరో సహోద్యోగి, 'పుట్టప్పకథ' ప్రచురణకర్త ఎస్. చన్నప్ప నా పుస్తకాన్ని ప్రచురించారు.

నేను మద్రాసుకు వెళ్ళి తెలుగు పుస్తకం ప్రచురించడానికి నెలముందే కన్నడ పుస్తకం అచ్చయిపోయింది. ఇది తలచుకుంటే నాకు ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారి విషయం గుర్తొస్తుంది. ఆయన ఆంధ్రులకు నాటక పితామహుడు. ఆయన రాసిన చిత్రనళీయం తెలుగుకంటె ముందు కన్నడంలోనే అచ్చయింది. అందువల్ల ఆయన కన్నడంలోనే రాసి తెలుగులోకి అనువదించుకునే వారని అనుకునే ప్రమాదముంది. నా పుస్తకాలు చూసినవారు కూడా అలాగే అనుకుంటారని నా భయం.

నా కన్నడ మూల తత్వాలను చూసి రాళ్ళపల్లిగారు తమ అమూల్యమైన అభిప్రాయం వెలిబుచ్చారు. దాన్ని పునశ్చరణ చేసుకోడం నా ధర్మం:

''జనపద సాహిత్యద మూల తత్వగళు' మీరు ఆ విషయంపై చేసిన తీవ్ర పరిశోధనను తెలుపుతుంది. కన్నడంలో మీరింత చక్కగా వ్రాయగలరని నేననుకొని యుండలేదు. ఉదాహరణలు లేక వట్టి మూలతత్వాల వివేచన - విశ్లేషణలు గలిగి యీ పుస్తకం, లక్షణానికి లక్ష్యమే పరిణీత ప్రయోజన మనుకునే నా వంటి వానికి, కొంత చదువుకొనడానికి బరువుగా తోస్తుందేమో!'' (21 - 4 - 76)

'జానపద సాహిత్య స్వరూపాని'కి, 'జనపద సాహిత్యద మూలతత్వ గళు'కు ముఖచిత్రాన్ని వేసి ఇచ్చిన పి.ఆర్. తిప్పేస్వామి గారిని కూడా నేను స్మరించుకోవాలి. ఆయన ప్రసిద్ధ చిత్రకారుడు. అపురూపమైన వ్యక్తి. చిత్రకళకు జీవితాన్నే అంకితం చేసిన బ్రహ్మచారి. మైసూరులోని జానపద వస్తువు దర్శనాలయానికి క్యూరేటర్‌గా ఉండి అపూర్వ వస్తువులను వేల సంఖ్యలో సేకరించారు. ప్రస్తుతం కర్నాటక లలిత కళా అకాడెమీ అధ్యక్షులు.

పి.ఆర్. తిప్పే స్వామిగారు పాతికేళ్ళనుంచి నాకు మంచిమిత్రులు. ఆయన నా పుస్తకాలలో చాలా వాటికి ముఖపత్రాలంకరణ చేశారు. జానపదం సంచికలకూ బొమ్మలు వేశారు. ఒక్క పైసా కూడా పుచ్చుకోలేదు, మహాత్ముడు.

## 1977

కర్నాటక సాహిత్య పరిషత్తు అనే సంస్థ ఉంది, మన ఆంధ్ర సాహిత్య పరిషత్తులాగే. అయితే కర్ణాటక పరిషత్తు ఇంకా బతికే ఉంది. కర్నాటక ప్రభుత్వం లక్షలకొద్దీ ధన సహాయం చేస్తుంది. కర్నాటక సాహిత్య పరిషత్తు ప్రతిసంవత్సరం సాహిత్య సమ్మేళనం జరుపుతుంది. దీనికి తప్పకుండా ముఖ్యమంత్రి హాజరవుతాడు. సమ్మేళనాధ్యక్షుడిగా ఎంపిక చేయబడడం గొప్ప గౌరవం. అదో అత్యున్నత పదవిగ భావిస్తారు.

కర్నాటక సాహిత్య పరిషత్తు వెయ్యికి పైగా గ్రంథాలను ప్రచురించిన మేటి సంస్థ. వాళ్ళ ప్రచురణలలో ఇతర భాషల ద్వారా కన్నడం నేర్చుకోవడానికి 'స్వయం బోధిని' పేరుతో ప్రచురించిన పుస్తకాలు

కూడా ఉన్నాయి. అప్పట్లో సాహిత్య పరిషత్తు అధ్యక్షులుగా ఉన్న జి. నారాయణగారు (ప్రస్తుతం ప్రెస్ అకాడెమీ అధ్యక్షులు) ఒకసారి మైసూరు విశ్వవిద్యాలయానికి వచ్చారు. అప్పటికే ఆయనకు నన్ను గురించి తెలుసు, ''తెలుగు - కన్నడ స్వయం బోధిని రాసి పెట్టండి'' అన్నారు. నేను మూడు నెలలో రాసి ఇచ్చాను. దీనిలో తెలుగు, కన్నడం రెండూ అచ్చువెయ్యాలి.

ఆ సమయంలోనే నాకు మైసూరులోని అరవింద ముద్రణాలయంతో పరిచయం లభించింది.

రచనాకాలంలో నాకు కలిగిన పరిచయాలు, అనుభవాలు విచిత్రమైనవి. కలకాలం గుర్తుంచుకో తగ్గవి. మైసూరులో అరవింద ముద్రణాలయం చిన్నది. దీని యజమాని కెంపలింగయ్య. ఒక రోజు అతని దగ్గరికి వెళ్ళి ''నాకు తెలుగు పుస్తకాలు వేసుకోడం కష్టంగా ఉంది. మీరు తెలుగు టైపులు తెప్పించండి. మీకు చేతినిండా పని ఇస్తాను'' అన్నాను.

''కంపోజ్ చేసేవాళ్ళు లేరు'' అన్నాడు.

''దానికి దారులు వెతుకుదాం. ముందు తెప్పించండి'' అన్నాను.

''మీరే పెట్టుబడి పెట్టండి'' అన్నాడు.

అతనికి ఐదువేల రూపాయలు అప్పు ఇచ్చాను. మేమిద్దరం మద్రాసు వెళ్ళి బృందావన్ టైపుల పేరుతో అందంగా ఉన్న టైపులకు ఆర్డరు ఇచ్చి వచ్చాము. అప్పటినుంచి కొన్ని సంవత్సరాలపాటు నా పుస్తకాలకు కెంపలింగయ్య ముద్రాపకుడు. మా యింటికి అతను హాజరుకాని రోజంటూ ఉండేది కాదు. ప్రతిరోజూ నాలుగయిదు పుటలయినా కంపోజ్ కావలసిందే. మైసూరులోని ప్రభుత్వ పాఠ్యగ్రంథాల ప్రెస్సులో తెలుగు ఉంది. అక్కడి

కంపోజిటరును పిలుచుకువచ్చి అరవింద ముద్రణాలయంలో ఒక కుర్రాడికి తర్ఫీదు ఇప్పించాము.

నా పుస్తకాలు ప్రచురించడంలో, దానికి వ్రాతప్రతిని తయారు చేయడంలో ఎన్నో విచిత్రాలున్నాయి. మైసూరులో నేను గ్రంథాలు ముద్రించినప్పుడు అక్కడి ముద్రాపకులకు, కంపోజిటర్లకు ఎవ్వరికీ తెలుగు అక్షరం ముక్కరాదు. అందువల్ల నేను అచ్చుకు ఇచ్చే ముందు ప్రతి అక్షరాన్నీ అచ్చులోలాగా సాధ్యమైనంత స్పష్టంగా, గుండ్రంగా రాసి ఇవ్వాలి. వారికి భాష తెలీదు కాబట్టి తప్పులు ఎన్నయినా చేయగలరు. అందువల్ల నాలుగు సార్లయినా ప్రూఫులు దిద్దాలి. ఇలా కొన్ని పదుల పుస్తకాలను ఇనుమడించిన కష్టంతో ముద్రింపజేశాను.

అరవింద ముద్రణాలయంలో తెలుగు - కన్నడ స్వయంబోధినితో మొదలుపెట్టి చాలాపుస్తకాలు వేయించాను. ఈ విధంగా నా ముద్రణ కార్యం మద్రాసు నుంచి మైసూరికి బదిలీ అయింది. ఫ్రీడమ్ ప్రెస్ యజమాని బాల సుందరంగారు కాలధర్మం చెందడంవల్ల మద్రాసులో పుస్తక ప్రచురణ కొనసాగించడమూ నాకు కష్టమే అయింది.

## కన్నడ సాహిత్య చరిత్ర

బెజవాడ గోపాలరెడ్డి గారికి మొదటినుంచి నేనంటే అభిమానం. వారు ఉత్తరప్రదేశ్ గవర్నరుగా చేసి నెల్లూరు వచ్చి చేరిన తర్వాత నెల్లూరి సాహిత్య వాతావరణంలో ఎంతో మార్పువచ్చింది. నేను ఎప్పుడు నెల్లూరు వెళ్ళినా 'సుదర్శన మహల్'లో వారిని కలిసేవాడిని. **1974లో** బెంగుళూరులో అఖిలభారత తెలుగు మహాసభలు జరిగాయి. ఆ సభలలో గోపాలరెడ్డిగారికి మరింత సన్నిహితుడినయ్యాను. ఆయన ఎప్పుడూ

అనేవారు "తమిళనాడులో చల్లా రాధాకృష్ణశర్మ గారు తెలుగుదీపం వెలిగిస్తున్నారు. నువ్వు కన్నడనాడులో వెలగించవయ్యా" అని. ఒకసారి ఇలాగే "శర్మగారు తమిళసాహిత్యాన్ని గురించి రాశారు. నువ్వు కన్నడ సాహిత్యాన్ని గురించి రాయి. అయితే విపులంగా రాయి" అన్నారు.

విపులమైన ప్రణాళిక వేసుకొని కన్నడ సాహిత్య చరిత్రరాశాను. అవసరమైన చోట తెలుగులో తులనాత్మకంగా వివేచన చేస్తూరాశాను. మొట్టమొదటి సారి కన్నడ జానపద సాహిత్యానికి కూడా సాహిత్య చరిత్రలో స్థానం కల్పించాను. గోపాలరెడ్డిగారు చాలా సంతోషించారు. అంతవరకు అకాడెమీ రచయితలకు పేజీకి ఒక్కరూపాయి ఇచ్చేది. కాని నాకు బహుశా 750 రూపాయలు కాబోలు ఇప్పించారు రామానుజరావుగారు. కన్నడ సాహిత్య చరిత్రను ఆవిష్కరించాలని కూడా గోపాలరెడ్డిగారు ఉత్సాహం కనబరచారు. అకాడెమీ పుస్తకాలను ఆవిష్కరించే పనిచేస్తేది కాదు. నేరుగా పుస్తకాలను మార్కెట్లోకి విడుదల చేసేది.

కన్నడ సాహిత్య పరిషత్తు వజ్రోత్సవాలు బెంగుళూరులో ఘనంగా జరిగాయి. ఆ సందర్భంగా సాహిత్య పరిషత్తు వారు నా 'కన్నడ స్వయంబోధిని'ని ఆవిష్కరించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు 'కన్నడ సాహిత్య చరిత్ర' ఆవిష్కరణ సభను పెట్టుకున్నారు. దీనికోసం ప్రత్యేకంగా గోపాలరెడ్డిగారు వచ్చారు. తెలుగు కన్నడ సాహిత్య సంబంధాలను గురించి మాట్లాడారు.

'కన్నడ సాహిత్య చరిత్ర'ను చదివి రాళ్ళపల్లివారు ఇలా రాశారు: "మీ కన్నడ సాహిత్య చరిత్రను సాంతముగా చదివి అనుభవించితిని. చాలా సంతోషమైనది. రచన విషయపుష్టమై సుగ్రహమధుర శయ్యతో సాగినది. ఇంకొకమారు చదువుకోగలను. తెలుగువారికిది నిష్పక్షపాతమైన పెద్ద కానుక. వారి పరముగా మీకు నా హార్దాభినందనలు".

సి. నారాయణరెడ్డిగారు 'జానపద సాహిత్య స్వరూపం' 'క సాహిత్య చరిత్ర' రెండూ చదివి ఉత్తరం రాశారు. మొదటి వా రచనల్ని చదివి చక్కని అభిప్రాయాలను అందజేసిన వారిలో ఒకరు.

"రెండు పుస్తకాలూ చదివేశాను. ఏమిటీ ఇంత తొంద అని మీరనుకుంటే - అది మీ దోషమే.

భావ ప్రకటనంలో సంయమనం, విషయం విశ్లేషణంలో ని శైలిలో పట్టుకు లాగే గుణం. ఉండడంవల్ల చాలా ఆసక్తికరంగా రూపొం రెండు పుస్తకాలూ.

'జానపద సాహిత్య స్వరూపం' వైజ్ఞానిక భిత్తిక పైన జ సాహిత్య హృదయాన్ని ఆవిష్కరించింది.

'కన్నడ సాహిత్య చరిత్ర' కొండని అద్దంలో చూపింది. ప గురించి, ఆధునిక కవితా ప్రారంభదశను గురించీ, నవ్యకవుల దృక్పథాలను గురించీ చాలా బాగా విశ్లేషించారు మీరు. సంతో (14 - 7 - 1978)

## అనంతరాగం

నేను, నా మిత్రులం కలిసి చేసిన ఘన కార్యాలలో రా అభినందన గ్రంథం ప్రచురించడమొకటి. తెలుగులో అభి సంపుటాలను ప్రచురించే అలవాటు తక్కువ. అప్పట్లో వావిళ్ళ సంపుటం గొప్పగా వెలువడింది. కాకతీయ సంచిక, గిడుగు రామ సంచిక లాంటివి పేరెన్నిక గన్నవి. అయితే హిందీ, కన్నడం మె

భాషల్లో అభినందన గ్రంథాలు శరపరంపరగా వెలువడ్డాయి. కన్నడంలో సన్మాన సంపుటాలదే ఒక ప్రత్యేక సాహిత్యశాఖలాగా వెలిసింది. అలాంటి సంపుటాన్ని రాళ్ళపల్లి వారికి సమర్పించాలని నేను, ఘట్టమరాజు అశ్వత్థ నారాయణగారు సంకల్పించాం.

అశ్వత్థనారాయణగారికి, నాకు బహుకాల పరిచయం. 1972లో మేమిద్దరం తంగిరాల గారితో కలిసి 'అలిచిప్పలు - ఆణిముత్యాలు' సంకలనం వేశాం. దాన్ని 'జానపద సమితి', బెంగుళూరు పేరుతో అశ్వత్థ నారాయణగారి చిరునామాతో ప్రచురించాం. తర్వాత నా 'జానపద సాహిత్య స్వరూపం' వేసేటప్పుడూ అశ్వత్థ నారాయణగారి చిరునామా తోటే 'జానపద విజ్ఞాన సమితి' పేరుతో ప్రచురించాను.

ఒకరోజు మేమిద్దరం బెంగుళూరులో రాళ్ళపల్లిగారిని కలిశాం. అప్పుడు వారు తమ కుమారుడు ఫణిశాయి గారింట్లో ఉండేవారు. తిరుపతినుంచి వచ్చి చివరి వరకు రాళ్ళపల్లి వారు అక్కడే ఉన్నారు.

''మేం మీకు సన్మానం చేసి ఒక సంపుటం సమర్పిద్దాం అనుకుంటున్నాం. దయచేసి మీరు అంగీకరించాలి'' అన్నాం.

''నేనేం చేశానని నాకు సన్మానం. నాకలాంటివి ఇష్టం ఉండవు'' అన్నారాయన.

''మీ తర్వాత నేను మైసూరు విశ్వవిద్యాలయంలో మీ స్థానంలో చేరాను. అందువల్ల మీకు అభినందన సమర్పించుకోవడం నా కర్తవ్యం. మీరు అంగీకరించక తప్పదు'' అన్నాను నేను.

చాలా కష్టం మీద ఆయనను ఒప్పించాం.

రాళ్ళపల్లి అభినందన కార్యక్రమం మేము అనుకున్నదాని కంటె వందరెట్లు గొప్పగా జరిగింది. ఎంతమంది ఎన్నిరకాలుగా సహాయం

చేశారో చెప్పలేం. రాళ్ళపల్లి వారంటే ఆంధ్రకర్నాటకాలలో ఎంత గౌరవం ఉందో తెలిసింది. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం నాలుగు వేల రూపాయల ధనసహాయం చేసింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, సంగీత నాటక అకాడెమీ, సారస్వత పరిషత్తు మొదలైన సంస్థలు ధన సహాయం చేశాయి. విశ్వవిద్యాలయాలలో కొందరు ఆచార్యులు పూనుకొని డబ్బు సేకరించి ఇచ్చారు. నాగార్జునలో దొణప్పగారు, గంగప్పగారు, కాకతీయలో సుప్రసన్నగారు, వెంకటేశ్వరలో జి.ఎన్.రెడ్డి గారు ఇలా ఎంతమంది ఈ సన్మానం తమదిగా భావించారు.

అభినందన సంపుటం ప్రచురించేటప్పుడు ఎన్నో అనుభవాలు ఎదురయ్యాయి. సంపుటం అత్యున్నత స్థాయిలో ఉండాలని, ఎంతగొప్ప రచయిత అయినా రచన బాగుండకపోతే సంపుటంలో చేర్చకూడదని నిర్ణయించుకున్నాం. ఇది ఎంత కష్టంతో కూడుకున్న పనో చెప్పనక్కరలేదు. ఇదో గొప్ప అనుభవం మాకు. కొంతమంది చాలామంచి వ్యాసాలు రాశారు. మూడు భాషల్లో (తెలుగు, ఇంగ్లీషు, కన్నడం) సంపుటాన్ని వెలువరించాము. రాసిన వాళ్ళలో బెజవాడ గోపాలరెడ్డి, మాస్తి వెంకటేశ అయ్యంగార్, డి. జవరేగౌడ, యస్వీ జోగారావు, సి. నారాయణరెడ్డి, జి.ఎన్. రెడ్డి, బి.రామరాజు మొదలైన కవులు, పండితులు, విమర్శకులు ఉన్నారు. ఈ సంపుటం ప్రచురించేటప్పుడు కొన్ని వింత అనుభవాలు కలిగాయి.

మా గురువుగారు సాళ్వకృష్ణమూర్తిగారిని ఏదైనా వ్యాసం రాయమని అడిగాను. తమకు తీరికలేదని వీలుంటే తప్పకుండా రాస్తానని అన్నారు. అయితే తర్వాత వారిలో ఏ అంతశ్శక్తి ప్రేరేపించిందో 'సురూపోదాహరణము' అనే పేరుతో చక్కని ఉదాహరణ కావ్యం రాసి పంపించారు. అది రాళ్ళపల్లి వారికి కూడా చాలా బాగా నచ్చింది. ఉదాహరణ

కావ్యంతోబాటు 'కావ్యంలో సత్త్వచర్చాభూమికలు' అనే పేరుతో ఒక వ్యాసంకూడా ఇచ్చారు సాళ్వవారు. దీన్ని గురించి రాళ్ళపల్లివారు ఎలాంటి అభిప్రాయం వెలబుచ్చుతారో తెలపమన్నారు. కాని నేను ఎప్పుడూ తెలపలేదు. రాళ్ళపల్లివారు "నాకు మా గురువుగారు రాసిన వ్యాసార్థం బోధపడలేదు. మీకేమైనా బోధపడిందా" అన్నారు. మా గురువుగారి ప్రౌఢశైలి, అలాంటిది.

మరో ప్రసిద్ధ అవధానిగారు నాకు నూట పదహార్లు పంపుతూ పద్యాలు కూడా పంపారు. కాని ఆ పద్యాలు ఏమీ విశేషం లేక మామూలుగా ఉండడంవల్ల మేం అచ్చువెయ్యలేదు. తర్వాత ఆ అవధానిగారు చాలా నిష్ఠూరంగా జాబురాస్తూ "నేను డబ్బులు కూడా పంపాను. మీరు నా పద్యాలు వెయ్యలేదు" అన్నారు. నేను వెంటనే ఆయన డబ్బు తిప్పి పంపుతూ "మీరు డబ్బులు ఇచ్చి పద్యాలు వేయించుకుంటారని తెలీదు. లేకుంటే మీ దగ్గర డబ్బులు పుచ్చుకునేవాళ్ళం కాదు" అని రాశాను.

తర్వాత కొన్నేళ్ళకు అదే అవధానికి నేను పిహెచ్.డి. మౌఖిక పరీక్ష జరపాల్సి వచ్చింది. నేను త్వరగా జరుపుతానో లేదో అని ఆయన సంశయపడ్డారు. కాని నేను మామధ్య లోగడ జరిగిన పత్ర వ్యవహారాన్ని ఏ మాత్రం పట్టించుకోకుండా మౌఖిక పరీక్ష జరిపి ఆయనకు డిగ్రీ ఇప్పించాను. అవధానిగారికీ చాలా సంతోషం కలిగింది, నాకూ తృప్తి కలిగింది. మా యిద్దరి మధ్య ఎలాంటి విరసం లేదని నిరూపితమయింది.

రాళ్ళపల్లి సంపుటం పరిమితుల్ని దృష్టిలో ఉంచుకోకుండా కొందరు సుదీర్ఘ వ్యాసాలు రాశారు. వాటిని విధిలేక కత్తిరించాల్సి వచ్చింది. దీనికి కొందరు మండిపడ్డారు. మనస్తాపం వ్యక్తం చేస్తూ జాబులు రాశారు.

కాని తప్పు వారిదే కాని మాది కాదు. మొత్తంమీద రాళ్ళపల్లి సంపుటం ఎన్నో రకాల మానవ సంబంధాలను కలిగించింది.

బెంగుళూరులో జరిగిన రాళ్ళపల్లి అభినందన సభ ఒక అపూర్వ విద్వత్సమ్మేళనం. ఆ సభకోసమే బెజవాడ గోపాల రెడ్డిగారు (సాహిత్య అకాడెమీ అధ్యక్షులు), కూర్మా వేణుగోపాల స్వామిగారు (సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు) తరలి వచ్చారు. ఇంకా ఎంతో మంది అభిమానులు ఎక్కడెక్కడి నుంచో అభిమానంగా వచ్చారు. అప్పుడు ఆకాశవాణి కేంద్రం నిర్దేశకులుగా బాలాంత్రపు రజనీకాంతరావు గారు బెంగుళూరులోనే ఉన్నారు. ఆయన మా ఆహ్వాన సంఘం అధ్యక్షులుగా ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా పాల్గొన్నారు. కర్నాటకంలోని మహనీయులెందరో ఆ సంబరాలలో ఆత్మీయంగా పాలుపంచుకున్నారు. 84 ఏళ్ళ వయసులో రాళ్ళపల్లివారు తమకు, సి.ఆర్.రెడ్డి గారికి ఉండిన అనుబంధాన్ని గురించి వివరించి రెడ్డిగారిని గూర్చి తాము రచించిన పద్యాలను చదువుతుంటే ఎంతోమందికి ఒళ్ళు పులకరించింది.

'అనంతరాగం' సంపాదకులుగా నేను, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, డా. శివలంక శ్రీరామ చంద్రమూర్తి వ్యవహరించాం. మూడు భాషల్లో ఉన్న ఆ పుస్తకాన్ని మైసూరులో అరవింద ముద్రణాలయంలోనే అత్యంత సుందరంగా ముద్రించాను. ముఖచిత్రం బ్లాకులు, లోపలి అపూర్వ ఛాయాచిత్రాల బ్లాకులు తయారు చేయించడం దగ్గర నుంచి ప్రూఫులు చూడడం వరకు నేను ఎంత శ్రద్ధగా, భక్తి పూర్వకంగా వ్యవహరించానో సగర్వంగా చెప్పుకోగలను. బెజవాడ గోపాలరెడ్డిగారు మేము ప్రచురించిన సంపుటం చూసి ''ఇది ఇంత అందంగా ఉంటుందనుకోలేదు. ఏదో చిన్న సంచికగా వేస్తారనుకున్నాను'' అన్నారు. అభినందన కార్యక్రమ నిర్వహణ కోసం వచ్చిన ప్రకటనలు, కొన్ని వ్యాసాలు కలిపి ఒక

అభినందన సంచికను కూడా ఆ సందర్భంలోనే ప్రచురించాము.

'అనంతరాగం' వల్ల ఎంతో తృప్తి, ఒక మహనీయుని గౌరవించామన్న సంతోషం కలిగినా ఎందరో వ్యక్తులు, సంస్థలు చాలా విసుగును, అసంతోషాన్ని కలిగించకపోలేదు. మన పుస్తకాలేవో మనం రాసుకుని, వీలైతే అచ్చువేసుకుని ఊరుకోవాలి కాని ఇలా అనేక వ్యక్తులతో, సంస్థలతో సంబంధం పెట్టుకోకూడదని అనిపించింది నాకు. అదే విషయం మిత్రులు అశ్వత్థనారాయణగారికి రాస్తే ఆయన ఈ క్రింది విధంగా జవాబిచ్చారు. అప్పటి మనః స్థితిని తెలుపుతుంది ఈ ఉత్తరం:

''మనమందరం కలిసి రాళ్ళపల్లి అభినందన సమితి ద్వారా ఘన కార్యమే చేశామనిపిస్తుంది. అందుకు మనకు మనమే కృతజ్ఞతలు చెప్పుకొనడం బాగుండదు. ఎటువంటి సంస్థలతోను కార్యక్రమాలు తలపెట్టుకొనకూడదను మీ అభిప్రాయం గురించి నేనేమి చెప్పగలను? వ్యక్తిగతంగా మనం గొప్పపని చేయగలము. కాని సామూహికంగా నెరవేర్పగల పనులు కూడా కొన్ని వుంటాయి కదా? అటువంటి మహత్ కార్యాలకు చేయివేయకుండా వుండవచ్చును. కాని కష్టపడి పనిచేస్తే మంచిపని చేయగలము అనిపిస్తుంది. మీకు కలిగిన నిర్వేదము నాకు ఇంకా కలగలేదు. మనము సంస్థలకు దూరంగా వుండటమేమిటి, సంస్థల పేరిట సేవ చేస్తున్న అసాహిత్య వేత్తలు మనలాంటి సాహిత్యాభిలాషుల్ని దూరంగా వుంచటం మీకు తెలియనిది కాదు. సంస్థ నిర్మించటం చాలా కష్టం. కొందరు త్యాగం చేయవలసి వుంటుంది. రాత్రిం బవళ్ళు శ్రమించవలసి వస్తుంది. మనలాంటి యువకులే సాహితీ సంస్థలకు దూరంగా వుండి, చేయి వేయక పోతే శ్రేయస్కరము కాదేమో అనిపిస్తుంది. అయినా రాళ్ళపల్లి అభినందన సమితి వంటి బృహత్కార్యాలు అనతికాలంలో తలపెట్టలేం కదా? సన్మానాలు ఉపన్యాసాలు చేయించటం చాలా తేలిక.

ఇంకొంచెం పటిష్ఠమైన కార్యాలు సుమారు ఖర్చులో జరిగే పనులు సంవత్సరానికి ఒకటయినా చేయాలని నా తలపు. అటువంటి ప్రణాళికలు కొన్ని నా మనస్సులో వున్నాయి. మీరు ఎప్పుడయినా బెంగుళూరు వచ్చినప్పుడు మీతో చర్చిస్తాను.

రాళ్ళపల్లి అభినందన సమితి కార్యక్రమాలు చూసిన సహృదయులు మన శక్తియుక్తుల మీద అపారమైన విశ్వాసం కలిగి వున్నారు. కొత్తవారిని కొందరిని చేర్చుకొని సాహిత్య సభలు చేయాలనే తలంపు నాకు ఉంది. అందులకు ఆ సాహితీ మిత్రుల సహకారం లభిస్తుంది. ఒకరిద్దరు నాతో అప్పుడే ప్రస్తావించారు. నేను ఇప్పుడే కాకపోయినా నిదానంగా వాటిని కార్యగతం చేయాలని అనుకొంటున్నాను. రచనా వ్యాసంగం సాగిస్తూ, ఇటువంటి నిర్మాణాత్మక కార్యాలు అప్పుడప్పుడు జరుపుతూ వుంటే తెలుగువారితో, తెలుగుదేశంతో మన సంబంధ బాంధవ్యాలు పెంపొందగల వని ఆశిస్తాను. మరి మీ అభిప్రాయము ఎట్లున్నదో''.

నేను, ఘట్టమరాజు గారు కలిసి ఇంకా ఎన్నో మంచి పనులు చేశాం. వాటికి పైలేఖ పీఠిక లాగుంది.

# 1978

రాళ్ళపల్లి వారి పీఠికలకు ఆంధ్రదేశంలో చాలా విలువ ఉంది. ఆయన లేఖలు రాసినా వాటిని పీఠికల్లా చేర్చుకున్నవారున్నారు. (ఆంధ్రుల సాంఘికచరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి). రాళ్ళపల్లి అభినందన సమితి కార్యక్రమాలు సన్మాన సంపుట ప్రచురణతోనే ఆగిపోతాయనుకున్నాము. కాని అవి ఆగలేదు. ఎందుకొచ్చిందో ఒకనాడు నాకు, అశ్వత్థ

నారాయణగారికి రాళ్ళపల్లి పీఠికలను ప్రచురిస్తే ఎలా ఉంటుందనే ఆలోచన వచ్చింది. దీనికి ముఖ్యకారణం రాళ్ళపల్లి వారి పీఠికలను గురించి జి.ఎన్.రెడ్డి గారు 'అనంతరాగం'లో రాసిన గొప్ప వ్యాసం. అదీకాక అప్పటి వరకు పీఠికలనే ఏర్చికూర్చి ప్రకటించిన గ్రంథాలు తెలుగులో ఎక్కువగా లేవు. ఒకటి రెండు ఉన్నా రాళ్ళపల్లి వారిలాగా పీఠికలు రాసేవారు తక్కువ ; రాసినా సమగ్రంగా సేకరించి ప్రచురించాలనే దృక్పథం కలవారు తక్కువ.

మేం పీఠికలను ప్రచురించాలనే ఆలోచనలో ఉన్నామని తెలిసి త్రివేణి పబ్లిషర్స్ వారు రాళ్ళపల్లి వారికి తామే వారి పీఠికలను ప్రచురిస్తామని ఉత్తరం రాశారు. అప్పుడు రాళ్ళపల్లివారు నాకో ఉత్తరం రాశారు.

''మచిలీపట్నంలో వుండే- త్రివేణి పబ్లిషర్స్'' యజమాని శ్రీ భావరాజు నరసింహారావుగారు - నా సారస్వతాలోకం - నాటకోపన్యాసాలను ప్రకటించినవారు - నా పీఠికలను సాహిత్యవ్యాసాలను ప్రకటించడానికి నాయనుజ్ఞకోరి జాబువ్రాసినారు.

నా సన్మానసంఘం తరఫున మీరు వాటిని ప్రకటించే భారం వహించే సూచన చేసితిరి గదా. ఆ విషయమై మీ ప్రయత్నానుకూల్యాలెట్లు న్నవి! మచిలీపట్టణం వారికంటే మీరు ముద్రించి ప్రకటించడమే నాకు మేలని తోచుచున్నది. దయయుంచి మీ యభిప్రాయం తెలిపితే కృతజ్ఞుడను''.

ప్రసిద్ధ ప్రకటన కర్తలకు వ్యాపారదృష్టితో అంగీకారాన్ని తెలపకుండా నాకు ఉత్తరం రాసిన రాళ్ళపల్లివారి సౌజన్యాన్ని గురించి మరేం చెప్పగలను!

''రాళ్ళపల్లి పీఠికలు'' పలువురి ప్రశంసలందుకుంది. ప్రాచీన కావ్యాలకు, నాటకాలకు, విమర్శగ్రంథాలకు, ఆధునిక కావ్యాలకు,

మాచార్యుని కీర్తనలకు వివిధ రకాల పీఠికలను రాసిన రాళ్ళపల్లి
పుస్తకం వారి ఖచ్చితమైన దృష్టికి, నిజాయితీకి, విలువలు కట్టే
నిదర్శనంగా ఉంది. సుమారు నాలుగువందల పుటల ఈ పుస్తకాన్ని
మైసూరులోని అరవింద ముద్రణాలయంలోనే అచ్చువేశాను.

పీఠికార్చన పేరుతో జి.ఎన్.రెడ్డి గారు చక్కని పీఠిక రాశారు.
లను ఆవిష్కరించే రోజు సొంత ఖర్చుతో జి.ఎన్. రెడ్డిగారు
ళూరికి వచ్చి సమావేశంలో పాల్గొన్నారు. వెల్చేరు నారాయణరావు
తో ఆరోజే రాళ్ళపల్లిగారింట్లో పరిచయమయింది. ఆరోజు
వేశంలో. వెల్చేరుగారూ పాల్గొన్నారు.

పీఠికలు వెలువడిన కొంత కాలానికే రాళ్ళపల్లివారు కాలధర్మం
ారు. మా రాళ్ళపల్లి అభినందన కార్యక్రమాలు ముగిశాయి. ఒక
చేతన వెళ్ళిపోయింది. ముఖ్యంగా నాకు వారి మరణంవల్ల ఒక
ప్రోహక శక్తి వెళ్ళిపోయినట్లయింది.

రాళ్ళపల్లి వారితో నాకుండిన పరిచయం వల్ల నా రచనలకు,
విధానానికి, సాహిత్య కృషికి ఒక స్ఫూర్తి ఏర్పడింది. ఒక్కొసారి
ల తరబడి వారు ఎన్నో విషయాలు చెప్పేవారు. విశ్వనాథ వారు
ళూరు వచ్చినప్పుడు నేనే రాళ్ళపల్లి వారింటికి పిలుచుకు వెళ్ళి
కాలం తర్వాత వారిద్దరు కలిసి మాట్లాడుతుంటే చూసి
దించాను. రాళ్ళపల్లివారు నాకు రాసిన ఉత్తరాలన్నీ భద్రంగా
కున్నాను. అవి నాకు పెన్నిధి లాంటివి.

సి. నారాయణరెడ్డిగారు నాకు రాశారు. రాళ్ళపల్లి వారు కాలధర్మం
న విషయం తెలిసి—

''ఎంత నిగ్రహించుకున్నా ఆకాశంలో కలిసిపోయిన 'అనంతరాగం'

ప్రతిధ్వనిస్తూనే వున్నది. పరమ శాంత గంభీరంగా'' అని.

రాళ్ళపల్లి పీఠికలను గూర్చిన ఒక చారిత్రక సత్యాన్ని కూడా ఇక్కడ చెప్పాలి. పీఠికలు వెలువడిన మరునటి సంవత్సరం కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి కోసం అది సిఫారసు చేయబడింది. చివరి వరకు వెళ్ళిందది. కాని సాహిత్య అకాడెమీ కార్యవర్గ సమావేశంలో ఒక విచిత్రం జరిగింది. సామాన్యంగా చివరి దశలో ఒక్కొక్క విజ్ఞుణ్ణి మూడు పుస్తకాలు సూచించమంటారు. కాని మన తెలుగు విజ్ఞులు తమకు నచ్చిన ఒక్కొక్క పుస్తకాన్నే సూచిస్తుంటారు. తమకు నచ్చిన వారికి బహుమతి వస్తే వచ్చినట్లు, లేకుంటే ఎవరికీ రాకూడదు. భారతదేశంలో ఒక ప్రాచీన భాష, హిందీ తర్వాత ఎక్కువమంది మాట్లాడే భాష ; కాని సిగ్గుచేటు. కొన్ని సంవత్సరాలు తెలుగుకు అసలు బహుమతే లేదు. ఆ సంవత్సరం ఇలాగే 'నీదా నాదా' అనుకుని చివరికి ఎవరికీ బహుమతి లేకుండా చేశారు. రాళ్ళపల్లివారు కీర్తి శేషులయ్యారు కాబట్టి వారికింక బహుమతి ఇవ్వడమెందుకని మరోసాకు. ఇలా ఆ మహనీయుడికి చెందాల్సిన గౌరవం చెందలేదు. దీనివల్ల రాళ్ళపల్లి వారికి వచ్చిన నష్టమేమీ లేదు. 'ఇదంతా నీకెలా తెలిసింది' అని నన్ను ఎవరైనా ప్రశ్నించవచ్చు. అనేక భాషలకు చెందిన మిత్రులు కేంద్రసాహిత్య అకాడెమీలో ఉన్నప్పుడు మన తెలుగు వారి ప్రతాపం ఎలాగో ఓలాగు తెలీకుండా ఉంటుందా!

## భాషా విజ్ఞానం

1978లోనే భాషా విజ్ఞాన రచనకూ శ్రీకారం చుట్టాను. అంతకు రెండు మూడేళ్ళ క్రితమే 'భాషా శాస్త్రప్రవేశిక' పేరుతో తెలుగులో ఒక పుస్తకం రాయాలని నేను, డా. శివలంక శ్రీరామచంద్రమూర్తి

కలిసి రెండు మూడు అధ్యాయాలు రాశాము. వాటిని ఆచార్య జి.ఎన్. రెడ్డిగారికి చూపెట్టాను. 'చాలా బాగుంది. విద్యార్థులకు బాగా ఉపయోగిస్తుంది. కానివ్వండి 'అన్నారాయన. అంతలో ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి పుస్తకం అదే పేరుతో వస్తోంది అని వార్త వచ్చింది. 'అంతటి మహనీయుడు పుస్తకం వేస్తుంటే మనం వేయనక్కరలేదు' అనుకొని మా పుస్తకాన్ని ఆపేశాం. కాని అప్పటికీ ఇప్పటికీ భద్రిరాజు గారి పుస్తకం మాత్రం రాలేదు.

తెలుగులో వద్దనుకున్న నేను కన్నడంలో ఇదే పని చేద్దామని ప్రారంభించాను. మైసూరు విశ్వవిద్యాలయంలో భాషా విజ్ఞాన శాఖలో ఆచార్యులు కె. కెంపేగౌడతో కలిసి ఒక పుస్తకం రాశాను. 'భాషెమత్తు భాషావిజ్ఞాన' (భాష- భాషావిజ్ఞానం) అనే పేరుతో దీనిని అచ్చువేశాము. దాన్ని ప్రచురించే సంస్థకు నేను 'భాషా విజ్ఞాన భారతి' అని పేరుపెట్టాను. అప్పటికి 'భారతి' పేరుతో మూడు సంస్థలను ప్రారంభించాను. రాళ్ళపల్లి వారు అధ్యక్షులుగా, నేను కార్యదర్శిగా ప్రవాసాంధ్ర భారతి' అని పేరుపెట్టాను. అప్పటికి 'భారతి' పేరుతో మూడు సంస్థలను ప్రారంభించాను. రాళ్ళపల్లి వారు అధ్యక్షులుగా, నేను కార్యదర్శిగా 'ప్రవాసాంధ్ర భారతి' ఒకటి, నేనే అధ్యక్షుడిగా 'జానపద విజ్ఞాన భారతి' (కార్యదర్శి డా. జి.ఎస్.మోహన్), 'భాషా విజ్ఞాన భారతి' మరొకటి. ఈ సంస్థలకు వనరులు గాని, వందలాది సభ్యులుగాని లేకున్నా సద్దులేని కార్యక్రమాలు, పుస్తకాలు మాత్రం ఉన్నాయి. 'భాషా విజ్ఞాన భారతి' ద్వారా ఇలా ఆ శాఖలోనూ కొంత ప్రవేశం చేశాను.

## 1979

ఈ సంవత్సరం నా సిద్ధాంత వ్యాస ప్రచురణతో ప్రారంభమయింది.

1973లో డిగ్రీ తీసుకున్నా వెంటనే నా సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించలేదు. దీనికి ముఖ్యకారణం వ్రాతప్రతిని పరిష్కరించాలనే ఉద్దేశమే. నాకు డిగ్రీ ఇచ్చేటప్పుడు ఆచార్య ద్రోణప్పగారు కొన్ని అమూల్యమైన సలహాలను ఇచ్చారు. వాటిని పాటిస్తూ సిద్ధాంత గ్రంథాన్ని చాలావరకు పరిష్కరించాను. 1979 వరకు జానపద విజ్ఞాన క్షేత్రంలో వచ్చిన మార్పుల్ని అందులో పొందుపరిచాను. ఇరుగు పొరుగు భాషలతో తెలుగు జానపద సాహిత్యాన్ని పోలుస్తూ ఎవ్వరూ అప్పటికి సిద్ధాంత గ్రంథం రాయనూలేదు, ప్రచురించనూ లేదు. అందువల్ల తులనాత్మక అధ్యయనానికి ఒక పద్ధతిని కూడా నేనే రూపొందించుకోవలసి వచ్చింది.

'తెలుగు - కన్నడ జానపద గేయాలు' విద్వాంసుల మెప్పును, సాహిత్య విద్యార్థుల ఆమోదాన్ని పొందింది. మొట్టమొదటి సారిగా నా పుస్తకాన్ని నా జన్మస్థలమైన నెల్లూరులో ఆవిష్కరించాను. అక్కడి మిత్రులు డా. కాళిదాసు పురుషోత్తం మొదలైనవారు సభను ఏర్పాటు చేశారు. ఆనాటి సభకు ముఖ్య అతిథిగా వచ్చి నా పుస్తకాన్ని ఆవిష్కరించినవారు దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు. 'అనంతరాగం' ప్రచురణ కాలం నుంచి నాకు వారు చాలా ఆత్మీయులయ్యారు. వారు నెల్లూరులోని వి.ఆర్. హైస్కూలులో మా నాన్నగారికి గురువులు. మరుపూరి కోదండ రామరెడ్డిగారి లాంటి పురప్రముఖులంతా ఆనాటి సభకు వచ్చారు.

ఆచార్య సి.నారాయణ రెడ్డిగారు నా పుస్తకాన్ని గూర్చి రాసిన అభిప్రాయం ఇలా ఉంది. (12 - 3 - 1979)

''మీ ఉత్తరం అందింది. మీ థీసిస్ రెండో రోజున్నే పొంతం చదివాను. అది చదివించే పుస్తకం. తెలుగు కన్నడ జానపద గీతాల తులనాత్మక పరిశీలనం అత్యంత సంయమనంతో చేశారు. విషయ విశ్లేషణంలోనే కాదు ; సమాచార సమీకరణంలోనే కాదు మీ రచనలో

భావుకత కూడా కనిపిస్తున్నది. విమర్శకుల్లో అంతగా కనిపించని
ఏమిది. మీ శైలి మీ అంతరంగానికి అందమైన పోతపోసింది.
ముగురించి మీరు వ్రాసిన పంక్తులు నన్ను కదిలించి వేశాయి''.

నా థీసిస్‌ను అలకామృత్యువు వాతపడిన ఒక ఆత్మీయ వ్యక్తికి
తం చేశాను. అడిగి అంకితం పుచ్చుకునే వారికి నేను ఏనాడూ
పుస్తకాన్నీ అంకితం చేయలేదు. నా అంకిత గేయంలో 'లయ'
గురించి రాశాను. అది సినారె గారిని కదిలించడం నా అదృష్టం.

నేను తరచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుండిన మేధావుల్లో
సంజీవదేవ్ గారొకరు. వారు నాకు అమూల్యమైన లేఖలెన్నో
రు, కవితాత్మకంగా, చిత్రాత్మకంగా. నా 'తెలుగు కన్నడ
పదగేయాలు' చదివి వారు ప్రతిస్పందించిన తీరు ఇలా ఉంది.
-1-1980).

''మీరు హృదయ పూర్వకంగా పంపిన మూడు గ్రంథాలు
నాయి. ధన్యవాదాలు. మీ ''తెలుగు-కన్నడ జానపదగేయాలు''
త్వరగా చదివేను. మీకు ఉత్తరం వ్రాసే నిమిత్తం. మరోసారి ఎక్కువ
రంగా చదువుతాను.

మీరు గ్రంథంలో చూపిన లోతు వెడల్పు, నిడివి మేధను,
దయాన్ని కూడా ఆకట్టుకొంటున్నాయి. ఇంగ్లీషులో 'ఎన్‌లైటన్‌మెంట్
క్ ఎంటర్ టైన్‌మెంట్' అంటారు చూడండి అవి అందులో
పుటనా ప్రత్యక్షం. అదంతా చదివిన తరువాత అనిపించింది దీన్ని
యారు చేయటానికి మీరెంత శ్రమపడ్డారో అని! నేనయితే అటువంటి
చేయలేను.

ఒక భాషలో అయితే పరవాలేదు, రెండు భాషలలో ఆ పనిచేయుటం

మీకే సాధ్యమేమో!, ధన్యం, మీ గవేషణా ప్రతిభ ఎన్నెన్ని అందరాని తావులనో అందుకొన్నారు. మరుగుపడిన చీకటి కోణాలను వెలిగించారు ; ఇంకా ఏమేమో చేశారు. చేయటం అయితే మీరు చేశారు కాని, ఆ చేసిన దాన్నిగురించి చెప్పాలంటే నాకు సాధ్యమా మరి? అయినా, కొంతయినా చెప్పకుండా వూరుకోలేను.

అసలు మీరు గ్రంథానికి వ్రాసిన విపుల ''ప్రవేశిక'' ఎంత గొప్పగా వున్నదో! ప్రతి వాక్యం ఎంతో సమీక్షాత్మక అంతర్ వీక్షణను కలిగి కాంతిమయంగా వున్నది. ఎన్నెన్నో దృక్కోణాలనుంచి విషయాన్ని గవేషించారు. Polygenesis, monogenesis, Psychoanalysis, structural analysis, irrationality మొదలైన విషయాలని చొప్పించి వాటిద్వారా అసలు విషయాన్ని వీక్షిస్తూ అద్భుతంగా పట్టుకవచ్చారు. విషయాన్ని ఎక్కడ తెగనీయకుండా, అసందర్భ దోషాలను చొరనీయకుండా. ఇందులో మీరు ముట్టని విషయం లేదు. రకరకాల శాస్త్రాలనూ వాడుకొన్నారు. ఈ గ్రంథంలో జానపద సాహిత్యంపైన ఇతర్ల గ్రంథాలను నేను చదివివున్నాను. వాటి ప్రత్యేకతలు వాటికున్నాయనుకోండి. కాని మీ గ్రంథ వైశిష్ట్యం ఒక విశిష్టంగా వున్నది. జానపదుల ప్రాణాలనుంచి వెలువడిన గేయాలు తిరిగి మీ రచనలో నవప్రాణస్పందన నందుకొన్నాయి. తార్కిక పారదర్శికత, హేతువాద విశ్లేషణ, విషయ విపులీకరణ, వైదుష్యం, అందరికీ అర్థం కాకపోయినా కొందరికైనా బాగా అర్థమయే శైలి మొదలైనవి మీ గ్రంథంలో ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. అందరికీ అర్థం కావాలనే నినాదం ఎవరికీ అర్థం కాకుండా వుండాలనే నినాదంతో సమానం. అందరికీ అర్థమయేది జగత్తులోనే లేదు ఎక్కడా!

మీ గ్రంథాన్ని గురించి ఇంకా ఇంకా వ్రాయాలంటే నేను నేనే కాని నేను మీరు కాదుగా! ప్రస్తుతానికి చాలు ఇంతవరకు. నా ప్రథమ

గ్రపెష్టను కొన్నింటిని ఇక్కడ అక్షర రూపంలో అభివ్యక్త పరచాను.
ంతే''.

నా రచన శంఖంలో పోసిన తీర్థం లాంటిదయింది వారి
వ్విమర్శకులోనై.

# ్వని విజ్ఞాన

గడచిన ఏడాది ప్రారంభించిన ''భాషావిజ్ఞాన భారతి'' కార్యకలాపా
ను ఈ ఏడు కూడా విస్తరించాము. నేను, డా. కెంపేగౌడ కలిసి
ధ్వని విజ్ఞాన' పేరుతో Phonetics మీద మరో గ్రంథం ప్రకటించాము.
ధ్వని విజ్ఞానాన్ని గూర్చి ప్రత్యేకంగా ఒక పుస్తకం చాలా భాషల్లో
లేదు. అది ఎక్కువగా భౌతిక శాస్త్రానికి, జీవశాస్త్రానికి సంబంధించిన
షయం. కెంపేగౌడ గారు విషయాలను అందిస్తే నేను వాటికి
ంరికొన్నింటిని జోడించి పుస్తకశైలిలోకి దించాను. ధ్వని విజ్ఞానం భాషా
ాస్త్రజ్ఞుల ప్రశంసలందుకుంది.

# ెలుగు కోయిల

ప్రవాసాంధ్రుడనై ఉంటూ నేను తెలుగు పుస్తకాలను సేకరించడంలో
ాని, చదవడంలోగాని, పత్రికలను సేకరించి చదవడంలోగాని ఏనాడూ
ెనకబడలేదు. మైసూరులో ఉన్నా తెలుగు కార్యక్రమాలను విరివిగా
ిరుపుతూ ఉండేవాణ్ణి. 1984లో 'ప్రజాపత్రిక' పేరుతో కొన్నాళ్ళు
సైక్లోస్టైయిల్ పత్రిక ఒకటి నడిపాను. ఆ నాటికి మైసూరులో ఎక్కడా
తెలుగు ముద్రణకు అవకాశాలు లేవు. మైసూరులోని తెలుగు సాంస్కృతిక

సమితి తరపున ఒక చిన్న బులెటిన్ నడపమంటే 1979లో 'తెలుగు కోయిల' అనే పేరుతో అచ్చువేయించసాగాను. మొదటి సంచికలో దాశరథి కవిత, సినారె, శేషేంద్ర సందేశాలు, రాళ్ళపల్లి వారిని గూర్చిన స్మృతి, దొణప్పగారి హరి కథా సర్వస్వం సమీక్ష ఉన్నాయి.

## 1980

జానపద విజ్ఞానాన్ని కన్నడిగులకు మొట్టమొదటిసారిగా పరిచయం చేస్తూ సుమారు ముప్పయ్యేళ్ళ క్రితం డా. హా.మా.నాయక్ ఒక పుస్తకం రాశారు. దానిలో నాలుగు వ్యాసాలున్నాయి. డా. తంగిరాల దీన్ని గ్రాంథిక భాషలో అనువాదం చేసి నాకిచ్చి చూసి పెట్టమన్నారు. 'ఇది తెలుగులో అచ్చువెయ్యాలయ్యా వెయ్యాలయ్యా' అనే వారు గాని వేసే ప్రయత్నం చేయలేదు. డా. హా.మా.నాయక్ (అప్పట్లో మా సంస్థకు డైరెక్టరు) 'మీరెందుకు అనువదించకూడదు' అన్నారు. నాకూ అలాగే అనిపించింది. వెంటనే అనువాదం ప్రారంభించి కొన్ని నెలల్లో అచ్చువేసేశాను. సుబ్బారావుగారు నువ్వువేసేశావా. మంచిపనిచేశావు. పానీలే' అని సహృదయంతో అన్నారు.

## గొరిల్లా

శేషేంద్ర శర్మగారితో నాకు 1974 ప్రాంతంలో పరిచయమయింది. అప్పటినుంచి మా మధ్య ఎంతో ఆత్మీయత బలపడింది. శేషేంద్ర శర్మగారి రచనల్లో నాకు గొరిల్లా నచ్చింది. ఎందుకో కన్నడం వారికి

డా అది నచ్చుతుందనిపించింది. అప్పట్లో శేషేంద్ర కవితలు కన్నడంలో
క మాసపత్రికలో ధారావాహికంగా వెలువడుతున్నాయి. నేను అనువాదం
దాన్ని మైసూరులో ఇద్దరు విద్వాంసులకు చూపించాను. డా.
చ్.ఎం. నాయక్ లోగడ మా దిగంబర కవులను కవిత్వం కాదంటూ
వ్యాసాలు రాసినవారు. కాని శేషేంద్ర కవిత చదివి చాలా బాగుందని
చ్చుకున్నారు. ముఖ్యంగా ఎన్.జి.ఓ. లను గురించి, గంగానదిని
రించి రాజకీయ నాయకులను గురించి రాసిన కవితలు.

నేను ఆ పుస్తకాన్ని ఇచ్చి చదివించిన మరో వ్యక్తి శంకరమొకాశి
శేకర్. కన్నడంలో నవ్యకవి, ఇంగ్లీషులో గొప్ప కవి, విమర్శకుడు,
గ్లీషు ప్రొఫెసర్. ఆయనకూ గొరిల్లా బాగా నచ్చింది. ''కవి రాజకీయ
భిప్రాయాలతో నేను ఏకీభవించను. కాని కవిత్వం, మీ అనువాదం
కు బాగా నచ్చాయి'' అన్నారు. గొరిల్లాకు 'మున్నుడి' రాసింది
రో ప్రఖ్యాత కన్నడ విమర్శకులు ప్రొ. హెచ్.ఎం.చన్నయ్య (ప్రస్తుతం
న్నడ అధ్యయన సంస్థ నిర్దేశకులు).

'జానపద విజ్ఞాన స్వరూపం' 'గొరిల్లా' పుస్తకాలను మైసూరు
శ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థలో ఆవిష్కరింపజేశాను.
న్నడంలో ప్రఖ్యాత కవి కె.ఎస్.నిసార్ అహమద్ గొరిల్లాను గురించి
ాట్లాడారు. కన్నడ ఎం.ఎ. మొదటి బ్యాచ్ విద్యార్థి (1927), రాళ్ళపల్లి
ష్యుడు, తెలుగు - కన్నడ విద్వాంసుడు ప్రొ. కె. వెంకటరామప్ప తెలుగు
స్తకం గురించి మాట్లాడారు.

## ారత భారతి

'భారత భారతి పుస్తక సంపద' పేరుతో బెంగుళూరులోని ఒక

పుస్తక సంస్థవారు పాకెట్‌సైజు పుస్తకాలు 550 ప్రచురించారు. భారత దేశంలో వివిధ రంగాలలో ప్రసిద్ధులైన వారిని గురించిన పుస్తకమాల అంది. అందులో విశ్వనాథ, రాళ్ళపల్లి, కందుకూరి, ప్రాచీనులైన పోతన, వేమన, శ్రీకృష్ణదేవరాయలు మొదలైన వారిని గురించి కూడా పుస్తకాలు వచ్చాయి. ఈ పుస్తకమాలలో భాగంగా పట్టాభి సీతారామయ్య, కోలవెన్ను రామకోటేశ్వరరావు గార్లను గురించి నన్ను రాయమన్నారు. నాకు ఇలాంటి పుస్తకాలు రాయడం ఇష్టం లేదు. అయినా ఇతర భాషలలో తెలుగు వారిని గురించి తెలపడమంటే ఒక కోశాన తొలుస్తూనే ఉంటుంది. అలాంటప్పుడు ఇవి చేయక తప్పదు. అందుకే రాశాను. తర్వాత భారత భారతి పుస్తకాల ప్రాశస్త్యం చూచి వాటిలో 50 పుస్తకాల హక్కులను టి.టి. దేవస్థానం వారు తీసుకున్నారు. కొన్నిటిని తెలుగులోకి అనువాదం చేయించి ప్రచురించారు కూడ.

## పఠాభి పన్‌చాంగం

1980 లోనే నేను మరో మంచిపని చేశాను. ఇంతకు ముందే చెప్పినట్లు 'ప్రవాసాంధ్ర భారతి' అనే సంస్థను నేను స్థాపించి కొన్ని కార్యక్రమాలు జరుపుతూ వచ్చాను. పుస్తకాలు కూడా ప్రచురిద్దామనే ఆలోచన వచ్చింది. పఠాభి పన్స్ రాయడంలో ప్రసిద్ధుడని తెలుగు సాహిత్యాసక్తులకు తెలిసిందే. వాటిలో కొన్ని పాత ఆనంద వాణి పత్రికలో వచ్చాయి. తర్వాత 1964లో జ్యోతి మాసపత్రికలో వరుసగా వచ్చాయి. నేను వాటినన్నిటినీ పుస్తకరూపంలో తెచ్చాను. నా మిత్రుడు ఆనంద్ అనే అతను జ్యోతి పత్రిక నుంచి పన్‌లను కాపీ చేసి పంపారు. మైసూరులో సి.ఎస్. రెడ్డి అని పారిశ్రామిక వేత్త ఉన్నారు. నేను చేసే అనేక కార్యక్రమాలకు ఆయన అండదండలు లభించాయి. నేను

శ్రీ "పఠాభి పన్ చాంగం" విషయం చెప్పగానే అప్పటి కప్పుడు 00 రూపాయలు తీసి ఇచ్చారు. అంతకు మునుపు దివిసీమ తుఫానుకు రి అయినప్పుడు కూడా ప్రవాసాంధ్ర భారతి ద్వారా ధనం, దుస్తులు గైరా సేకరించి పంపాము. అప్పుడో సి.ఎన్. రెడ్డిగారు చాలా సహాయం శారు.

వెంటనే 'పన్ చాంగం' మైసూరులోని అరవింద ప్రెస్‌లో అచ్చుకు చ్చేశాను. ముఖ చిత్రంతో సహా అచ్చు అయిపోయింది. ముఖచిత్రం ాడా నేనే వేశాను. నాకు అదో సరదా. ఎప్పుడూ తంగిరాల బ్బారావుగారు చెప్తూనే ఉంటారు: "నీకిదేం సరదా. చక్కగా మంచి ర్టిస్టుల చేత వేయించు" అని. కాని నా సరదా కొద్ది కొన్ని పుస్తకాలకు నే బొమ్మలు గీచుకున్నాను. అయితే గమ్మత్తేమిటంటే శ్రీశ్రీ గారు ఠాభి పన్‌చాంగం ముఖచిత్రం చూసి "ఎవరు వేశారో గాని చాలా ాగా - అంటే ఆలోచనాత్మకంగా - వేశారు. అబూ అబ్రహాం రేఖా చిత్రం ాగుంది" అన్నారు. నాకు ఎంత సంతోషం వేసిందో, ఒక్కరయినా చ్చుకున్నారు కదా అని.

ఇంతకీ నేను అచ్చువేసిన 'పన్‌చాంగం' ఆవిష్కరించాలి. అంతలో జవాడ గోపాలరెడ్డిగారు "నీవు పంచాంగం అచ్చువేస్తున్నావట. ఇదిగో కు కొంత ధనసహాయం చేస్తున్నాను" అని కొన్ని వందలు (ఎంతో ర్తులేదు) ఇచ్చారు.

గోపాలరెడ్డిగారే సాహిత్య అకాడెమీ ద్వారా కూడా కొంత ధనసహాయం ఇప్పించారు. ఇవన్నీ నాకు ప్రాధేయపడకుండానే దొరికాయి. నేను ఎప్పుడూ డబ్బుకోసమో, సహాయం కోసమో, స్వార్థం కోసమో దేవులాడలేదు. సహృదయులు వారికి వారుగా నా కృషి తెలుసుకొని సహాయం చేస్తే వద్దనలేదు.. పన్‌చాంగం ప్రచురణకు ఇంతగా అన్ని

వైపులనుంచి ప్రోత్సాహం లభించేసరికి నేను మొదట ప్రచురించిన 500 ప్రతులు కాక మరో 500 ప్రతులు మళ్ళీ మంచి పేపరు మీద, మంచి కవరుతో ముద్రించాను. ఇలా ఒకే పుస్తకాన్ని ఒకే సమయంలో రెండుసార్లు ముద్రించవలసి వచ్చింది. పన్‌చాంగం ప్రతులు కూడా అచిరకాలంలోనే చెల్లిపోయాయి.

మైసూరులో 'పఠాభి పన్‌చాంగం' ఆవిష్కరణ సభ జరిపారు. దీని కోసం మద్రాసునుంచి శ్రీశ్రీ గారు వచ్చారు. బెంగుళూరు నుంచి పఠాభి వచ్చారు. చాలా సంవత్సరాల తర్వాత వాళ్ళు అదే మళ్ళీ కలవడం. ఆరోజు శ్రీశ్రీ గారి కోసం (అప్పుడు శ్రీశ్రీ కి సప్తతి మహోత్సవాలు జరుగుతున్నాయి) వెయ్యిన్నూట పదహార్లకు పఠాభి గిఫ్ట్ చెక్కులు పట్టుకొచ్చారు.

1980లోనే నేను, అశ్వత్థ నారాయణగారు కలిసి 'జానపదం' అనే అనే పత్రికను కూడా ప్రారంభించాము. ఈ కథలు చెప్పుకుంటూ పోతే కొండవీటి చాంతాండంత అవుతాయి. దేశం కాని దేశంలో ఉంటూ కొందరు మిత్రుల సహాయంతో ఎన్నో పనులు చేయగలిగినందుకు నాకెంతో హాయనిపిస్తుంది. 'జానపదం' ప్రథమ సంచిక మార్చి 1980లో వెలువడింది. అదే సంవత్సరం మరో మూడు సంచికల్ని కూడా ప్రచురించాము.

## దాక్షాయణి

నా మనస్సుకు విరుద్ధంగా చేసిన పనుల్లో 'దాక్షాయణి' అనే పుస్తకం రాయడం ఒకటి. మత సంబంధమైన కార్యక్రమాలలో పాల్గొనడం, మత ప్రచారానికి తోడ్పడడం, ప్రాచీనతకు అనవసరంగా పట్టం కట్టడం

టి వాటికి 1972 నుంచే దూరమయ్యాను. నాకు తోచినవి, నాకు
వి రాసుకుంటూ పోవడమే నేను చేసిన పని. కాని తిరుపతిలోని
స్వరు ఆత్మీయమిత్రుల ప్రోద్బలం వల్ల టి.టి.డి. వారికి మీరాబాయి,
యణి అని రెండు పుస్తకాలు రాసి పెట్టడం జరిగింది. కాని
ంటిలోను ఒక సాహిత్య విద్యార్థిలాగా వివరాలు రాసి పెట్టడమే
మానవాతీత శక్తుల 'ప్రాబల్యాన్ని సమర్థించలేదు. హేతువాదులు
ా పౌరాణిక నాటకాలు రాసినట్లు నేనూ ఇలాంటివి కొన్ని చేశాను.
తప్పో ఒప్పో నిర్ణయించే స్థితిలో నేను లేను. స్నేహితుల ప్రోద్బలంవల్ల
రాయవలసి వచ్చింది. వాటిలో మీరాబాయి అచ్చుకానేలేదు.
యణి మాత్రం ఒకటి రెండు సార్లు ముద్రింపబడింది. కృష్ణా పుష్కరాల
ం వేసిన ఈ పుస్తకాలు లక్షప్రతులకు పైగా అమ్ముడయినట్లు
్నను.

## 81

1980లో మైసూరులోని తెలుగు సాంస్కృతిక సమితి తరపున
క సెమినారు జరిపాను. దానికి నేను, డా. పరిమిరామ నరసింహం
స్తుతం హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో రీడరు) సారథ్యం
ంచాము. సెమినారులో సమర్పింపబడిన వ్యాసాలను 'భాష - జానపదం'
ంతో పుస్తకంగా అచ్చు వేశాము.

1981లోనే కేంద్ర సాహిత్య అకాడెమీలో నాకు రచనల పరంగా
బంధం ఏర్పడింది. 'పంజె మంగేశరావ్' అనే కన్నడ రచయిత
శతాబ్ది ప్రారంభంలో కన్నడ భాషా సాహిత్యాలకు అపారమైన సేవ
ారు. ఆయనను గురించి వి. సీతారామయ్యగారు ఇంగ్లీషులో (Markers

of Indian Literature series) పుస్తకం రాశారు. దాన్ని తెలుగులోకి అనువదించమన్నారు అకాడెమీ వారు.

వి. సీతారామయ్యగారిది చాలా క్లిష్టమైన శైలి. వాక్యాలు కొరుకుడుపడవు. చాలా పొడుగైన వాక్యాలు. దాన్ని అనువాదం చేసేసరికి తలప్రాణం తోకకు వచ్చింది.

1981లోనే మైసూరు విశ్వవిద్యాలయం వారికోసం 'తెలుగు భాషె మత్తు సాహిత్య' అనే పుస్తకం రాసిపెట్టాను. మహాకవి కె.వి. పుట్టప్ప ఉపాధ్యక్షులుగా ఉన్న కాలంలో 'గృహసరస్వతీ గ్రంథమాల' అన్నదాన్ని ప్రారంభించారు. 150 - 200 పుటల్లో కొన్నివిషయాలను గూర్చి సరళ సుందరమైన పుస్తకాలను ప్రచురించాలని వారి ఉద్దేశం. ఈ గ్రంథమాలలోనే నేను తెలుగు భాషా సాహిత్యాలను కన్నడం వారికి పరిచయం చేస్తూ ఈ పుస్తకం రాశాను.

'జానపదం' సంచికలు మరో నాలుగింటిని కూడా అదే సంవత్సరం ప్రచురించాను.

# 1982

అమెరికాలోని విస్కాన్సిన్‌లో ప్రపంచంలోని అనేక ప్రాంతాల నుంచి జానపద విద్వాంసులను పిలిచి జానపద మహాకావ్యాలను గురించి సదస్సు జరిపారు. దానికి నన్ను, జానపద విజ్ఞానాచార్యులు డా. జె.ఎస్. పరమశివయ్యగారిని భారతదేశం నుంచి ఆహ్వానించారు. అప్పుడే ఎ.కె. రామానుజన్ వంటి ప్రపంచ ప్రసిద్ధ కవి విమర్శకులతో పరిచయం ఏర్పడింది. అమెరికాలో పేపరు కోసం నేను ఎల్లమ్మ కథ తెలుగు

ాలంలో ఎలా ఉందో తులనాత్మకంగా పరిశీలించాను. దానికోసం
గల్, మహబూబ్‌నగర్, నల్గొండ, ధారవాడ, గుల్బర్గా మొదలైన
్లో పర్యటించి చాలా సమాచారం పోగుచేశాను. అమెరికాకు వెళ్తూ
పదం' సంచికను ఇంగ్లీషులో అచ్చువేసి పట్టుకెళ్ళాను. మన జానపద
కావ్య సంప్రదాయం మీద అందులో వ్యాసం రాయించాను.

1982లోనే యువ భారతి వారి 'జానపద సాహిత్యం' అనే పుస్తకాన్ని
రించారు. లోగడ జానపద సాహిత్య స్వరూపం రాసినప్పుడు రాళ్ళపల్లి
కేవలం శాస్త్ర విషయాలను రాసి లక్ష్యాలను ఇవ్వకపోతే చదవడం
ుగానే ఉంటుందని అభిప్రాయం వెలిబుచ్చారు. అందువల్ల 'జానపద
త్యం'లో లక్షణాలతో బాటు లక్ష్యప్రదర్శన కూడా చేశాను.
వభారతి వారు ఆ పుస్తకాన్ని రెండుసార్లు ముద్రించారు.

# 83

నా జానపద విజ్ఞాన పరిశోధనకు పరమావధిగా దాదాపు పదిహేనేళ్ళు
జరిపిన సాహిత్య కృషి ఫలితంగా 'ఆంధ్రుల జానపద విజ్ఞానం'
పుస్తకాన్ని రచించాను. దాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ
ప్రచురించారు. ఒక జాతి జానపద విజ్ఞానాన్ని గురించి ఇంత
ంగా శాస్త్రీయంగా రచించిన పుస్తకాలు ప్రపంచంలోనే చాలా అరుదుగా
్నయని ప్రఖ్యాత జానపద విజ్ఞాన వేత్త అలన్ డండెస్ గారే మైసూరు
నప్పుడు ప్రశంసించారు. తమకు తెలుగు తెలియకపోయినా ఆ
కాన్ని అమూల్య నిధిగా దాచుకుంటానని ఒక ప్రతి అడిగి తీసుకొని
ళ్ళారు. నా జీవితంలో చేసిన సాహిత్య తపస్సుకు ఫలంగా ఆంధ్రుల
పద విజ్ఞానం వెలువడింది. దీని వెనక ఆత్మీయమైన కథ మరొకటి
ి.

పిహెచ్.డి. తర్వాత నేను డి.లిట్. చేయాలనుకున్నాను. నిజానికి జానపద వైద్యాన్ని కూలంకషంగా పరిశోధించి డి.లిట్. సిద్ధాంత వ్యాసం తయారుచేయాలని అనుకున్నాను. కాని తర్వాత ఆంధ్రులకు సంబంధించిన జానపద విజ్ఞానమంతటినీ ఒకచోట పోగు చేయాలని అనిపించింది. జాన్ బ్రున్ వాండ్ రాసిన "American Folklore" అత్యుత్తమ గ్రంథాలలో ఒకటి. అది నాకు ఓ నమూనాలా కనిపించింది. దోణప్పగారు అత్యంత శ్రమకోర్చి, తమ పాండిత్యాన్ని, ధనాన్ని, విశ్లేషణ సామర్థ్యాన్ని వెచ్చించి తయారుచేసిన 'తెలుగు హరికథా సర్వస్వం' కూడా నాకు స్ఫూర్తి నిచ్చింది.

డి.లిట్.కు సిద్ధాంత గ్రంథం సమర్పించాలంటే దాన్ని ప్రచురించాలి. 500 పుటలకు పైగా పుస్తకం రాసి దాన్ని అచ్చువేసుకోవాలంటే సామాన్యమైన పని కాదు. నేను ఒక ప్రణాళిక రూపంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారికి ఆంధ్రుల జానపద విజ్ఞానం ఇచ్చాను. వారు అంగీకరించారు. నేను రాసిన వ్రాతపతిని గొప్ప పండితుల పరీక్షకు గురిచేసి గౌరవధనం నిర్ణయించమన్నారు. వారు సహృదయంతో మూడువేల రూపాయల గౌరవధనంతో బాటు $12^{1/2}\%$ రాయల్టీ నిర్ణయించారు. అది ఎంత, ఏమిటి అన్నది కాదుప్రశ్న. అసలు అచ్చు అవుతుందో లేదో అన్నదే ప్రశ్న అయింది. ఆ రోజుల్లో గోపాలరెడ్డిగారు, నాకు అత్యంతాప్తులయిన ఇరివెంటి కృష్ణమూర్తిగారు చేసిన సహాయం ఈ జన్మలో మరిచిపోలేను. పుస్తకం రాలేదని నాకంటే ఇరివెంటి కృష్ణమూర్తిగారే ఎక్కువగా బాధపడిపోయారు. వారే స్వయంగా ప్రయత్నించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుంచి ఈ పుస్తకం కోసమే గ్రాంటు పొంది పుస్తకాన్ని అచ్చువేశారు. అది అచ్చు అయ్యే సమయంలో దేవులపల్లి రామానుజరావుగారు అకాడెమీ అధ్యక్షులు. ఈ మహనీయులందరూ నా మీద అనురాగం, ఆప్యాయత

చూపకపోతే నా పుస్తకం అచ్చు అయ్యేదీ కాదు, నాకు డి.లిట్. డిగ్రీ లభించేదీ కాదు.

## పాల్కురికి సోమనాథుడు

మైసూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థ ప్రకటిస్తున్న సమగ్ర కన్నడ సాహిత్య చరిత్ర సంపుటాలకోసం పాల్కురికి సోమనాథుణ్ణి గురించి ఒక వ్యాసం రాయాల్సి వచ్చింది. అప్పుడు అతన్ని గురించి అనేక విషయాలను మళ్ళీ మళ్ళీ చదివాను. కన్నడ అధ్యయన సంస్థలో ఉండే వ్రాత ప్రతులలో పాల్కురికి సోమనాథుడి అనేక రచనలున్నాయి. వాటిలో పంచ ప్రకార గద్యలు మొదలైనవే కాక కొన్ని కొత్త రచనలు (ఇంతవరకు పరిశోధకుల దృష్టికి రానివి) కూడా ఉన్నాయి. మైసూరు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం నిర్దేశకులు శ్రీ కె.టి. వీరప్ప నన్ను ఒక పుస్తకం రాసి పెట్టమని అడిగారు. అప్పుడే పాల్కురికిని గురించి రాశాను.

మైసూరు విశ్వవిద్యాలయం ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో పుస్తకాలను ప్రచురించే రెండుమూడు విశ్వవిద్యాలయాలలో ఒకటి. వారి పుస్తకాలలో 'ప్రచారోపన్యాసమాల' ఒకటి. ఏదైనా విషయాన్ని గురించి సుమారు 30 - 40 పుటలలో వ్యాసం రాస్తే దాన్ని పాకెట్ సైజులో 80 - 100 పుటలలో ముద్రించడం జరుగుతుంది. ఇలాంటి పుస్తకాలకు చాలా ప్రాచుర్యం లభించింది. ఒకసారి జి.ఎన్. రెడ్డిగారు ఆ ప్రచురణలను చూసి ముగ్ధులై ఎప్పటికైనా తమ విశ్వవిద్యాలయంలో అలాంటి 'ప్రచారోపన్యాసమాల'ను చేపట్టాలని ఆశించారు.

అదే సంవత్సరమే 'జానపద విజ్ఞాన భారతి' ద్వారా పుస్తకాలను ప్రచురించాలని కూడా నిర్ణయించాను. మిత్రుల ప్రోత్సాహం లభించింది. మొదటి పుస్తకంగా కె. సుమతిగారి 'జానపద కథా స్రవంతి'ని ముద్రించాను. సుమతిగారికి నేను పిహెచ్.డి. పరీక్షకుడిగా ఉన్నాను. ఆవిడ నల్గొండ జిల్లాలో, ఇతర తెలంగాణా జిల్లాలలో తిరిగి కథలు సేకరించి తమ సిద్ధాంత వ్యాసానికి అనుబంధంగా ఇచ్చారు. ఆ అనుబంధంలోని కథలనే నేను 'జానపద విజ్ఞాన భారతి' ప్రచురణగా తీసుకువచ్చాను. ఈ పుస్తకం ప్రచురించే నాటికి అరవింద ముద్రణాలయం (మైసూరు)లో తెలుగు అచ్చులు అరిగిపోయాయి. అప్పటి వరకు తెలుగు కంపోజ్ చేస్తూ వచ్చిన కుర్రాడు డిగ్రీ పాసై ఉద్యోగం వచ్చి వెళ్ళిపోయాడు. నాకు మళ్ళీ అచ్చు కష్టాలు ప్రారంభమయ్యాయి. విజయవాడలో నా పరిశోధక విద్యార్థి డా. వి.వి.భానుమూర్తి మాయింట్లో మనిషిలాంటివాడు. అతనికి నామీద ఉన్న ప్రేమానురాగాలు వర్ణనాతీతమైనవి, స్వచ్ఛమైనవి. 'జానపద కథా స్రవంతి'ని అతను విజయవాడలో అచ్చువేసి ఇచ్చాడు. ఇలా ఆ పుస్తకం కోసం నేను నానా బాధలు పడవలసి వచ్చింది. అయితే త్వరలోనే ఈ బాధలనుంచి విముక్తుడి నయ్యాను. మైసూరులోని మరో ప్రెస్సు (మిత్ర ప్రింటర్స్) వారితో నాకు ముందునుంచి పరిచయముంది. నా భాషా విజ్ఞాన గ్రంథాలను, జానపద సాహిత్య గ్రంథాన్ని అతనే ముద్రించాడు. అతనిని బతిమలాడి, మళ్ళీ కొన్నివేలు అప్పు ఇచ్చి మద్రాసునుంచి టైపులు తెప్పించాను. కొత్త టైపులతో 'తెలుగు సాహిత్య స్రవంతి' మొదటి పుస్తకంగా అచ్చయింది.

మైసూరు విశ్వవిద్యాలయం పరిధిలో డిగ్రీ కళాశాల విద్యార్థుల కోసం ఒక పాఠ్య గ్రంథం అవసరమయింది. నేను అధ్యక్షుడిగా సంపాదకమండలి సిద్ధమయింది. అలా వచ్చిందే 'తెలుగు సాహిత్య స్రవంతి' అంతకుముందే నేను కర్నాటక ప్రభుత్వం వారికోసం మూడు నాలుగు పాఠ్యగ్రంథాలు తయారుచేశాను. వాటిలో వ్యావహారిక భాషకు స్థానం కల్పించాను. మొదటిసారిగా శ్రీశ్రీ, జాషువా, రాళ్ళపల్లి కృష్ణశాస్త్రి

వదేవ్ మొదలైనవారి రచనల్ని పాఠాలుగ స్వీకరించడం జరిగింది.

టగడ్డ అని ఒకరున్నారు. భలే సరదా మనిషి. ఎన్నెన్నో చేస్తుంటారు. మధ్య మధ్య కొంతమందికి అవార్డులు ఇస్తుంటారు. ంకలనం ఏదైనా ఉంటే అవార్డు ఇచ్చి ప్రచురిస్తామని ప్రకటన నేను కొన్ని కవితల్ని సంకలనంలా కూర్చి పంపాను. అచ్చు య్య డబ్బులు ఇచ్చేస్తే నేను మరింత అందంగా అచ్చువేసుకుంటాన కాని ఆయన అంగీకరించలేదు. ఆయనే వేశారు. ఆయన ంరణల్లోకి కొంత బాగానే వేశారు. కాని ఒక కవితా సంకలనం తీరులో లేదు. మిత్రులు కె. శివారెడ్డి ఒకసారి చీవాట్లు "వేయగలిగితే అందంగా వెయ్. లేకంటే ఊరుకో" అని. నిపించింది.

## ...కాంధ్ర యక్షగానాలు

కసారి ప్రఖ్యాత సాహిత్యవేత్త కె. శివరామ కారంతగారితో తగాదా న్నాను. ఆయన కన్నడ యక్షగానమే తెలుగు యక్షగానానికి ని ఒకచోట రాశారు. నేను దానికి ప్రతిస్పందిస్తూ కన్నడ ం కంటె ముందు తెలుగులో యక్షగానం ఉందని చెప్తూ 'ప్రజావాణి' త్రికకు ఉత్తరం రాశాను. తర్వాత ఒక వ్యాసమూ రాశాను. పెరిగి పెరిగి కర్నాటకాంధ్ర యక్షగానాల తులనాత్మక సమీక్షగా యింది. ఈ పుస్తకం ముద్రించడానికి 'కర్నాటక జానపద - న అకాడెమీ' వారు ధన సహాయం చేశారు.

మైసూరు విశ్వవిద్యాలయం ప్రచారోపన్యాసమాలలో అన్ని విషయాలకు సంబంధించిన పుస్తకాలు ప్రచురితమయ్యాయి. తెలుగు సాహిత్యానికి సంబంధించిన శ్రీనాథ, పోతన, వేమన, తెలుగుచాటు పద్యాలు మొదలైన పుస్తకాలు ప్రకటింపబడ్డాయి. వరుసలో నేను పాల్కురికి సోమనాథుణ్ణి గురించి రాశాను. ఈ పుస్తకాలు ఒక్కొక్కటి 5 - 6 వేలు ప్రచురిస్తారు. వెల 25 పైసలు మాత్రమే.

# 1984

నేను 1983లో రెండోసారి అమెరికా వెళ్ళాను. వాషింగ్టన్‌లో జరిగిన తెలుగు మహాసభల్లో (తానా సభలు) పాల్గొన్నాను. ఆ రోజు జానపద కళల్ని గురించి నేనిచ్చిన ఉపన్యాసం విని చాలా సంతోషించి ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారులు ఎస్.వి. రామారావు గారు నాకు 500 డాలర్లు ఇచ్చారు. దీన్ని ఏదైనా జానపద విజ్ఞాన గ్రంథానికైనా వినియోగించుకోండి. లేదా అమెరికాలో మీ ఖర్చులకైనా ఉంచుకోండి" అన్నారు. వారి ఉదారస్వభావానికి, తెలుగు సంస్కృతి పట్ల, కళల పట్ల ఉన్న ఆసక్తికి చలించిపోవడం నావంతయింది. వారిచ్చిన 500 డాలర్లూ అక్కడే ఖర్చయిపోయాయి. ఎప్పటికైనా ఒక పుస్తకం అచ్చువేసి వారికి అంకితమివ్వాలని అనుకుంటూనే ఉన్నాను. కాని ఇప్పటివరకు వీలుకాలేదు.

అయితే రామారావుగారిచ్చిన డబ్బును సద్వినియోగం చేశాను. యు.ఎస్.ఏ. దక్షిణాదిన వేలమైళ్ళ దూరంలో అలబామాలో మా గురువుగారు రాజగోపాల్ ర్యాలి ఉన్నారు. వారిని చూడడం కోసం అంతదూరమూ గ్రే హౌండ్ బస్సులో ప్రయాణం చేశాను. పి.యు.సి., బి.ఎస్‌సి.లలో నాగురువుగారైన ర్యాలి గారికి పరమానందమయింది. విశ్వవిద్యాలయానికి తీసికెళ్ళి అంతా చూపించారు. ఒక విషయం చెప్పారు.

"నేను వచ్చి చాలా ఏళ్ళయింది. పిహెచ్.డి. డిగ్రీ తీసుకొని కూడా చాలా ఏళ్ళయింది. కాని థీసిస్ అచ్చువెయ్యలేదు. వేస్తే నా ప్రమోషన్‌కు వీలుగా ఉంటుందేమో. ఇక్కడ అచ్చు వెయ్యడం కష్టం''

"మీకెందుకు సార్. నేను అచ్చువేయిస్తాను'' అన్నాను వెంటనే.

"దానికయ్యే ఖర్చంతా నేనే భరిస్తాను'' నీవు ఆ విషయంలో ఏమీ సంకోచించవద్దు. అచ్చువేసి పెట్టుచాలు'' అన్నారు.

' డ్యూక్ యూనివర్సిటీలో రాజగోపాల్ ర్యాలి గారు పిహెచ్.డి. కోసం తీసుకున్న విషయం "A semantic Analysis of Telugu Kinship terms". మానవ శాస్త్రాన్ని భాషాశాస్త్ర విశ్లేషణకు అనరాగా చేసుకొని కొత్త పద్ధతుల్లో తయారుచేసిన సిద్ధాంత వ్యాసమది. నేను ర్యాలి గారి వ్రాతప్రతిని మైసూరికి తీసుకవచ్చి శారదాముద్రణాలయమనే చోట ఇచ్చాను. ఎంత శ్రద్ధ వహించినా అచ్చుతప్పులు చాలా వచ్చాయి. చివరి ప్రూఫు బాగా చూసి ఇచ్చిన తర్వాత కూడా మళ్ళీ తప్పులు ముద్రించారు. నాకు ఏం చెయ్యడానికీ పాలుపోలేదు. ఒకవైపు గురువుగారి థీసిస్. అదీ అలబామాలో ఆయన ప్రమోషనుకోసం చూపించుకోవలసిన పుస్తకం. అలాంటిది తప్పుల తడకగా ఉంటే ఎలా?

అప్పుడు మిత్రుడు పి.ఎస్. గోపాలకృష్ణ మద్రాసులోనే ఉన్నాడు (నా మిత్రుడు, ప్రెసిడన్సీ కళాశాలలో నా జూనియర్, తర్వాత నా పరిశోధక విద్యార్థి కూడా - నన్ను ప్రేమతో అన్నయ్యా అని పిలిచే వారిలో ఒకడు). డా. గోపాలకృష్ణ నా బాధ చూడలేక మైసూరులో అచ్చయిన పుస్తకాన్ని మద్రాసు తీసికెళ్ళి అక్కడి Diocesan press లో అచ్చువేయించాడు. అప్పుడతను కేంద్రసాహిత్య అకాడెమీకి మద్రాసులో ప్రాంతీయ కార్యదర్శి. అందువల్ల చాలా ప్రెస్సులతో సంబంధం ఉంది. ఇలా ర్యాలి గారి థీసిస్‌ను రెండుసార్లు ముద్రించడం జరిగింది. మిత్రుడు డా. గోపాలకృష్ణకు కృతజ్ఞతలతో ప్రవాసాంధ్ర భారతి ద్వారా ప్రచురించిన ర్యాలి గారి థీసిస్‌ను అమెరికా పంపించాను.

1985లోనే 'జానపద విజ్ఞాన భారతి' తరఫున రెండో పుస్తకం అచ్చువేశాను. అది డా. జి.ఎన్.మోహన్ గారి 'జానపదుల తిట్లు' అదో విశిష్ట సంకలనం. తెలుగులో ఇంకా ఈ విషయంమీద పరిశోధన జరగలేదు కాని కన్నడంలో ఎం.ఫిల్.కు పిహెచ్.డి.కి కూడా జరిగింది. తెలుగులో తిట్టుకవిత్వాన్ని గూర్చి మాత్రం పుస్తకాలు వచ్చాయి. జి.ఎన్. మోహన్‌గారు కష్టపడి 900 తిట్లవరకు సేకరించారు. 24 పుటల పీఠిక కూడా రాశారు.

# 1986

'చైతన్య కవితా వేదిక' ప్రారంభమైన సంవత్సరం. నేను తంగిరాల సుబ్బారావు గారు మైసూరులోని 'ధ్వన్యాలోక'మనే సంస్థలో నలభైరోజుల పాటు 'ఫెలో'లుగా ఉన్నాం. 'ధ్వన్యాలోక' పద్మభూషణ సి.పి. నరసింహయ్యగారి సంస్థ. ఒక ఆశ్రమం లాగుంటుంది. ఫోర్డు ఫౌండేషన్ సహాయంతో ఆయన రచయితలకు ఫెలోషిప్ ఇచ్చి ఏదైనా రాయమనేవారు. మేమున్న కాలంలో తంగిరాలవారు మినీ కవితలు రాశారు. నేను 'A Dictionary of South Indian Folklore' తయారుచేశాను.

మేము ఉన్న సమయంలోనే ప్రపంచ ప్రఖ్యాత నవలాకారుడు హెచ్. రాజారావ్, ఒక సిలోన్ రచయిత, ప్రఖ్యాత మలయాళ కవి పణిక్కర్ మొదలైనవారు అక్కడ ఉన్నారు. ఏదో ఒకటి చెయ్యాలనే తపన నిరంతరం పీడించే నేను, ఎప్పుడూ చైతన్యంతో మిసమిసలాడే తంగిరాలగారూ ఏవేవో ఊహలు చేశాం, ప్రణాళికలు వేశాం. చివరికి కవిత్వానికే అంకితమైన పత్రిక పెట్టాలని నిర్ణయించాం. 'ధ్వన్యాలోక'లో వాగర్థ 'Poetry Times' మొదలైన భారతీయ పత్రికల్ని అనేక పాశ్చాత్య పత్రికల్ని చూసి మాకు ఇలాంటి స్ఫూర్తి కలిగింది.

ఒకసారి నేను, తంగిరాల హైదరాబాదు వెళ్ళి శేషేంద్ర, కె.

శివారెడ్డి, నగ్నముని, నిఖిలేశ్వర్ మొదలైన చాలామంది మిత్రులతో సారస్వత పరిషత్తులో ఒక సమావేశం పెట్టాం. ఆ రోజు రంగనాథాచార్యులు మొదలైన వారంత మంచి మంచి సలహాలు ఇచ్చారు. ఇవన్నీ జేబులో వేసుకొని మళ్ళీ మైసూరు వచ్చి చైతన్య కవిత మొదటి సంచికను చాలా అందంగా ముద్రించాం. అంతకుముందే 'ముకుళిత పత్రం' పేరతో కొన్ని కవితలతో, మా ధ్యేయోద్దేశాలతో ఒక 'ఫోల్డర్' ప్రచురించాం. దాన్ని దాశరథి, మధనాపంతుల, పుట్టపర్తి మొదలైన వారు మెచ్చుకుంటూ ఉత్తరాలు రాశారు. చైతన్య కవితకు ఆంధ్ర రాష్ట్రం నలుమూలల నుంచి మంచి ప్రతిస్పందన వచ్చింది. తంగిరాల వారు, నేను పడుతున్న 'జంటబాధ' చూసి చాలామంది మిత్రులు జోకులు వేసుకునేవారు. 1986 ఏప్రెల్‌లో మొదటి సంచికను అక్షయ వసంత సంచికగా ఆవిష్కరించాం. మైసూరులోని 'ధ్వన్యాలోక' లోనే ఆచార్య ఎస్వీ జోగారావుగారు ఆవిష్కరించారు. వచన కవిత, పద్యకవిత, అనువాద కవిత అని మూడు శీర్షికలలో కవితల్ని ప్రచురించ సాగాము. 1986లోనే అక్షయ శరత్తు సంచిక కూడా పఠాభి ముఖ చిత్రంతో వెలువడింది. కవుల ముఖ చిత్రాలు వేసే ఏ పత్రికా తెలుగులో లేని దురదృష్టం కదా మనది. సినిమా ముఖాలు చూపందే పత్రికలు చదవరుకదా మనవాళ్ళు. కవిత్వానికి సంబంధించిన పత్రిక కాబట్టి కవులనే ముఖచిత్రంగా వేద్దామని నిర్ణయించాం. పత్రికలో ప్రకటనలు కూడా ఉండరాదని, ఒక్కో సంచికను ఒక్కో కవితా సంకలనంలాగా తయారు చేయాలని నిశ్చయించాం.

ఇన్నిపాట్లు పడి ఎక్కడో దేశం కాని దేశంలో ఇంత అందంగా ఒక కవిత్వ పత్రికను తీసుకువస్తుంటే (ఆరు నెలలకోసారి) ఎంతోమంది మెచ్చుకున్నా ఒకరిద్దరు వక్రభాష్యాలు చెప్పకపోలేదు. మిత్రులు చేకూరి రామారావుగారు చేరాతల్లో అలనాటి కవితను గురించే చాలా భాగం రాసి (చైతన్య కవితను గూర్చిన (వ్యాసంలో) చివరికి పత్రిక అదోమాదిరి ఉందని తేల్చేశారు. నేను చాలా బాధ పడ్డాను. 'ఎడమ చేరాతలు' పేరుతో ప్రతిస్పందించాను. అయితే రామారావు గారు అందరి లాంటివార

కారు, సరదా మనిషి. నేను ఒకసారి కలిసినప్పుడు "భలే రాశారండీ. మీరు అలా రాయాలనే నేను గిల్లి వదిలిపెట్టాను" అన్నారు. హాయిగా నవ్వుకున్నాను.

## మాలపల్లి

తెలుగువారు సగర్వంగా చెప్పుకోగలిగిన గొప్ప నవల మాలపల్లి. కేంద్ర సాహిత్య అకాడెమీవారు మరుపూరు కోదండరామ రెడ్డిగారి చేత నవలన సంక్షిప్తం చేయించి ప్రకటించారు (త్రివేణి పబ్లిషర్స్ ద్వారా). దానిలోనూ 350 - 400 పుటల వరకు ఉన్నాయి. దానిని కన్నడంలోకి అనువదించ వలసిందిగా కేంద్ర సాహిత్య అకాడెమీ వారు కోరారు మాలపల్లిని అనువదించడమంటే సామన్యం కాదు. అందులో ఉన్నవి లక్ష్మీనారాయణగారు వాడినవాడుక పదాలకు లెక్కలేదు. వాటిని వేరే భాషలకు అనువదించడం చాలా కష్టం. నేను ఈ అనువాదాన్ని 1979 - 80 మధ్యలోనే పూర్తిచేశాను. కన్నడ మాండలికం వాడడంలో నాకు ఎం.ఎ.లో నా విద్యార్థిని ఒకరు చాలా సహాయం చేశారు. లేకుంటే నేనీ అనువాదం చేయగలిగే వాణ్ణికాదు. నా శ్రమ ఫలించింది. శేషేంద్ర 'గొరిల్లా' కన్నడ అనవాదానికి, 'మాలపల్లి' కన్నడ అనువాదానికి - రెండింటికీ నాకు ఉత్తమ అనువాదాలుగా కేంద్ర ప్రభుత్వ మానవ వనరుల శాఖవారి పురస్కారాలు లభించాయి.

'మాలపల్లి' అనే పేరును 'హొలగేరి' అనే పేరుతోనే అనువాదం చేశాను. కాని కులంపేరిట వద్దని అకాడెమీ వారు 'సంగవిజయ' అని పేరు పెడదామన్నారు. ఉన్నవవారు 'మాలపల్లి'కి 'సంగవిజయ'మనే నామాంతరాన్ని ఎలాగూ సూచించే ఉన్నారు.

కేంద్ర సాహిత్య అకాడెమీకే నేను రాసిన మరో పుస్తకం సి.ఆర్. రెడ్డి. ఇంగ్లీషులో డి. ఆంజనేయులు గారు రాసిన పుస్తకానికి కన్నడ

అనువాదం ఇది.

## STUDIES IN FOLKLORISTICS

1986లోనే నేను, డా. గోపులింగారెడ్డి, డా. జి.ఎస్. మోహన్ కలిసి కొన్ని ఇంగ్లీషు పుస్తకాలు వేద్దాం అని అనుకున్నాము. Floklore Book Trust అనే పేరుతో ఈ పుస్తకాలు ప్రచురిద్దామని నిర్ణయించాం. మొదటి పుస్తకంగా 'Studies in Folklorities' వెలువడింది. అందులో మా ముగ్గురివీ ఇంగ్లీషు వ్యాసాలున్నాయి.

జానపద విజ్ఞాన భారతి ప్రచురించిన చివరి సంచిక (21వ సంచిక) కూడా అదే సంవత్సరం వెలువడింది. నేనూ ఒక విధంగా అలిసిపోయాను. మైసూరులో ప్రెస్సుల చుట్టూ తిరిగి తిరిగి ప్రతి ఒక్కరికీ ఉత్తరాలు రాసి వ్యాసాలు తెప్పించి ప్రచురించడం ఎంతో శ్రమతో కూడుకున్నపని. చైతన్య కవిత మీదే దృష్టి నిలుపుదామని మిగిలిన కార్యక్రమాలను కొంత వరకు ఆపాను.

# 1987

'సుందర ప్రభవ' పేరుతో కవితా సంకలనం వేశాను. నేను తంగిరాల ఎంతో కాలంగా కవితా సంకలనం వేయాలని అనుకుంటున్నాం. 'హంసపదిక' తర్వాత తంగిరాల గారు మళ్ళీ కవితా సంకలనం వెయ్యలేదు. ఇద్దరం హైదరాబాదు వెళ్ళి శీలావీర్రాజు గారి చేత ముఖ చిత్రాలు వేయించాం. తంగిరాల వారు పూర్తిగా వేయించారు నేను అక్షరాలు మాత్రం రాయించి మిగిలిన చిత్రం వగైరా రూపకల్పన నేనే చేసుకున్నాను. కె.శివారెడ్డి 'సుందర ప్రభవ' చూసిన తర్వాత ఇలా వెయ్యమన్నానయ్యా నిన్ను, 'నిద్రాపుష్పం' లా కాదు, అన్నారు.

1987లో శేషేంద్ర శర్మగారు షష్టిపూర్తి చేసుకున్నారు. ఈరోజు

నేను, తంగిరాల సుబ్బారావుగారు హైదరాబాదులో ఉన్నాం. ఆరోజే శేషేంద్ర శర్మగారు 'గుండెపూసిన గులాబి' అనే పేరుగల తంగిరాల వారి కవితా సంకలనాన్ని, నా 'సుందర ప్రభవ'ను ఆవిష్కరించారు. శేషేంద్ర, పఠాభి నా పుస్తకానికి భూమికలు రాశారు. పఠాభి నా అంతరంగాన్ని అర్థం చేసుకున్నారనుకుంటాను. ''సుందరం కవితలు శక్తివంతమైన దృశ్య ప్రతీకల్ని ప్రత్యక్షం చేస్తాయి. ఆ ప్రతీకలు బలమైనవి, సజీవమైనవి. అవి తీవ్ర సంవేదనాత్మకాలై కవి అనుభూతుల లోతుల్ని అభివ్యక్తం చేస్తున్నాయి'' అని రాస్తూ తర్వాతి వాక్యంలో ''ఈ కవితల్లోని సంగీతం సామన్యుని వచోధారకు దగ్గరగా ఉంది ; కావ్య కౌశలానికి వాహికగా ఉంది'' అని రాశారు. శేషేంద్ర ''డా. సుందరంగారి కవితల్ని చదవడం ఒక నూతన పుష్పాన్ని ఆఘ్రాణించడంలాంటి అనుభవం'' అని రాశారు.

'సుందర ప్రభవ'ను గురించి మంచి సమీక్షలు వచ్చాయి. టి.ఎల్. కాంతారావుగారు వారం వారం ఆంధ్రప్రభలో రాస్తుండిన 'కాలమ్'లో దీన్ని గురించి రాశారు. ప్రఖ్యాత కవి డా. సోమసుందర్ చాలా చక్కని విశ్లేషణ చేశారు (ఆంధ్రభూమి), అయితే నన్ను కదిలించివేసే అనుభవం కలిగింది. వారణాసిలో ఉండిన ఇ.ఆర్.కె. శాస్త్రిగారి ఉత్తరం, ఆయన సాహిత్యాభిమాని, అక్కడ డిప్యూటి రిజిస్ట్రారుగా ఉండేవారు. తెలుగులో చాలా కవితా సంకలనాలను ఆయన బైండు చేయించి భద్రంగా పెట్టుకున్నారు. 'సుందర ప్రభవ' మొదటి పేజీ నుండి చివరి పేజీవరకు చదివి నాకు తొమ్మిది పేజీల ఉత్తరం రాశారు. ఆయన గుండెలోతుల్లోంచి వచ్చిన అక్షర ప్రవాహంలో నేను మునిగిపోయాను. ఆయనకు నచ్చినవి, నచ్చనివి రెండూ ఉదాహరిస్తూ ప్రతి కవితనూ విశ్లేషిస్తూ రాశారాయన.

తర్వాత ఒక విచిత్రం జరిగింది. బెంగుళూరులో తెలుగు విశ్వవిద్యాలయం వారి అఖిల భారత తెలుగు మహాసభలు జరిగాయి. నేను తులనాత్మక సాహిత్యం సెమినారులో పాల్గొన్నాను. నా పక్కన

ఒక వ్యక్తి కూచున్నారు ''సుందరంగారిని చూడాలని వచ్చానండి. ఆయన నాకు ఉత్తరాల ద్వారా చాలా ఆత్మీయుడయ్యారు. ఈ రోజు ఈ సెమినారులో ఆయన పేరుంది'' అన్నారు.

''నేనేనండీ ఆ సుందరాన్ని. మీ రెవరు?'' అన్నాను.

''ఇ.ఆర్.కె. శాస్త్రిని. వారణాసి నుంచి వచ్చాను'' అన్నారు.

మాకిద్దరికీ కలిగిన సంతోషాన్ని మాటల్లో ఎలా వర్ణించగలను? నేను తర్వాత వారణాసి వెళ్తే ఆయన ఎంత ప్రేమగా చూసుకున్నారో! మళ్ళీ వారణాసి వెళ్ళి ''ఏరీ మన శాస్త్రిగారు'' అని దిగగానే అడిగాను.

''ఆయన చనిపోయారు'' అన్నారు మిత్రులు డా. జి.త్రివిక్రమయ్య.

ఎంతమంది ఆత్మీయ మిత్రులు ఇలా రాలిపోయారో తలచుకుంటే ఒక్కసారి దిగులుగా ఉంటుంది.

'సుందర ప్రభవ'ను గురించి నేను ఎక్కువగా రాయను కాని, దాన్ని చాలామంది అర్థం చేసుకోలేదనుకుంటాను. పఠాభి గారు 'చండమారుత' అని ఒక కన్నడ చలన చిత్రం తీశారు. దానికీ బంగారు పతకం వచ్చింది. కాని ఎవరికీ అర్థం కాలేదు. ''నేను ఇప్పటి అత్యాధునిక విధానమైన జర్నలిస్టిక్ విధానంతో ఈ సినిమా తీశాను. దాన్ని జనం సరిగ్గా అర్థం చేసుకోలేకపోయారు'' అన్నారాయన. నా పరిస్థితీ కొంతవరకు అలాంటిదే. అందుకే పఠాభి మాత్రం కొంతవరకు నా విధానాన్ని అర్థం చేసుకున్నారని అన్నాను.

'సుందర ప్రభవ'లో నేను ఒక ప్రయోగం చేశాను. చాలా కవితల్ని అప్పటికప్పుడే సంకలనం కోసమే రాశాను. ఆశు కవిత్వంలాగా. ''కవితల్లోని సంగీతం సామాన్యుని వచోధారకు దగ్గరగా ఉంది'' అని పఠాభిగారనడంలో నిజం ఉంది. కొన్ని వస్తువుల్ని సామాన్యుని వచోధారలో నడిపించుకుంటూ వెళ్ళి అక్కడక్కడా కవితాత్మకమైన మెలికల్ని ఇచ్చే ప్రయత్నం చాలా కవితల్లోచేశాను నేను.

నా కవితలకు ప్రతిస్పందన చూపించిన మరో మహనీయుడు డా. సంజీవదేవ్ 1 - 8 - 89న వారు రాసిన ఉత్తరంలో ఇలా రాశారు:

''సుందర ప్రభవను త్వరలో చదివి ముగించి మీకీ పంక్తులు వ్రాయటానికి ఆనందిస్తున్నాను.

నేనిదివరలో చాలామంది నవీన కవుల, ప్రవీణ కవుల కవితం గ్రంథాలకు పీఠికలు వ్రాశాను. కాని ఆ కవితలన్నీ గొప్పగా ఉన్నప్పటికీ మీ ''ప్రభవ'' ను చదివిన తరువాత మీ కవితలు ఒక విచిత్రమైన గొప్పగా ఉన్నట్లు తట్టింది నాకు. మీ కవితల వస్తువులు ప్రత్యేకంగా ఉన్నాయి, శిల్పం ప్రత్యేకంగా ఉన్నది, కల్పన ప్రత్యేకంగా ఉన్నది. ఒకటేమిటి, అసలు ఆ ప్రత్యేకతంతా ఒక ప్రత్యేకంగా ఉన్నది! మన మిత్రులు తంగిరాల వారి మీద మీ కవిత చదివి ఎంతగా నవ్వుకొన్నానో! ఎంతో రక్తి కట్టింది అది. మీ ప్రతీ కవితలోని మాటలు అది వరకు లేవేమో, మీరు సృష్టించినవి మాత్రమేమో అనే భ్రమ జనించింది! మీ ''ప్రభవ''ను గురించి ఇంకేమేమో వ్రాయగలను కాని దాన్ని ప్రస్తుతానికి ఆపి మీ ఉత్తరంలోని విషయానికి వస్తాను''.

ఉత్తరంలోని విషయమేమిటంటే కర్నాటక సాహిత్య అకాడెమీ వారి 'అనికేతన' అనే పత్రిక కోసం వారి ఉత్తరాలు కొన్ని పంపమని సంజీవదేవ్ గారికి రాశాను.

## అనికేతన

కర్నాటక సాహిత్య అకాడెమీ వారికి ఒక త్రైమాసిక పత్రిక ఉంది. దాని పేరు 'చందన' గా ఉండేది. తర్వాత అది 'అనికేతన'గా మారింది. నేను, కన్నడంలోని ప్రఖ్యాత కవి హెచ్.ఎస్. వెంకటేశమూర్తి, బి.వై. లలితాంబ అనే ముగ్గుర్ని కర్నాటక సాహిత్య అకాడెమీ వారు సంపాదకులుగా

చేశారు. మేము సంపాదకులుగా ఒక 'చందన' 12 'అనికేతన' సంచికలు వచ్చాయి. అవి మామూలు సంచికలు కావు. సాహిత్యానికి అమూల్యమైన కానుకలని గొప్ప గొప్ప విద్వాంసులు ప్రశంసించారు. ఎందుకంటే మేం తీసుకున్న నిర్ణయాన్ని బట్టి కన్నడ పత్రికలో ప్రపంచ సాహిత్యాన్నంతా పరిచయం చెయ్యాలి. ఇంగ్లీషు 'అనికేతన' పనులు 1987లో ప్రారంభమయ్యాయి. మొదటి సంచిక 1988లో వెలువడింది. మూడేళ్ళ పాటు వాటిని శ్రద్ధతో నిర్వహించాము.

1987లో కాళోజీ ముఖచిత్రంతో ఒక 'చైతన్య కవిత'ను శేషేంద్ర ముఖచిత్రంతో మరో చైతన్య కవితను వెలువరించాము. చైతన్య కవితా వేదిక తరఫున 'శేషేంద్ర చమత్కారికలు' అనే పేరుతో పాకెట్ సైజు పుస్తకాన్ని ప్రచురించాము. దానికి చాలామంచి ప్రచారం లభించింది. చమత్కారికల ప్రచురణ శేషేంద్ర శర్మ గారికి చాలా సంతోషం కలిగించింది.

అదే సంవత్సరం నేషనల్ బుక్‌ట్రస్ట్‌వారు నా 'ఆంధ్రప్రదేశ్ జానపద' అనే కన్నడానువాదాన్ని ప్రచురించారు. ఆచార్య బి. రామరాజుగారు ఇంగ్లీషులో రాసిన "Folklore of Andhra Pradesh" కు కన్నడ అనువాదమది. వారి పుస్తకానికి తెలుగు అనువాదం ఇప్పటి వరకు వెలువడలేదు. తెలుగు జానపద విజ్ఞానాన్ని కన్నడం వారికి పరిచయం చేసే ఏకైక పుస్తకం నేను చేసిన అనువాదం.

## 1988

'చందన' ఒక సంచిక 'అనికేతన' నాలుగు సంచికలు, 'చైతన్య కవిత' రెండు సంచికలు తీసుకువచ్చాము. 'అనికేతన'లో సినారె, శివారెడ్డి, శేషేంద్ర, సీతారాం, జయప్రభ మొదలైన అనేక కవుల కవిత్వాలను పరిచయం చేశాను. ఇటీవలి తెలుగు కవిత్వాన్ని గూర్చి వ్యాసం ప్రకటించాను. చైతన్య కవిత 5, 6 సంచికల పైన అజంతా, దాశరథి,

సోమసుందర్ ముఖచిత్రాలు వేశాము. ఒకదానిలో దేవులపల్లి శ్రీశ్రీ కలిసి ఉన్న విశేష ఛాయా చిత్రాన్ని ప్రచురించాం.

## 1989

ఈ సంవత్సరం కూడా రెండు చైతన్య కవితల్ని, నాలుగు అనికేతన సంచికలన్ని వెలువరించాము.

కర్నాటక సాక్షరతా సమితి (వయోజన విద్య) ఒక పుస్తకమాలను ప్రచురించారు. దానిలో భాగంగా మాయ మంత్రాలను గురించి ఒక పుస్తకం రాసి ఇవ్వమన్నారు. నేను "మాట, మంత్ర, మోడి ఎష్టు సత్య" అనే పేరుతో రాసి ఇచ్చాను. మాయమంత్రాలు, చేతబడులు మొదలైన వాటిలో ఎంత వరకు సత్యముంది అనే విషయాన్ని సామాన్యులకు కూడా అర్థమయ్యేట్లు రాశాను. నేను నేర్చుకున్న ఇంద్రజాల విద్య, హిప్నాటిజం, మంత్రతంత్రాలను గూర్చిన అవగాహన, జానపద విజ్ఞానంతో పరిచయం ఈ పుస్తకం రాయడంలో పనికి వచ్చాయి.

## 1990

యువభారతి వారు 'పరిశోధన పద్ధతులు' ప్రకటించారు. ఇది కూడా మానవ సంబంధాల దృష్ట్యా నేను అప్పుడప్పుడు తలచుకునే విషయం.

నేను పరిశోధన పద్ధతులను గురించి యువభారతికి ఒక పుస్తకం రాసి పెట్టాను. అది బహుశా 1987 లోనో 88 లోనో యువభారతికి ఇచ్చాను. అంతలో యువభారతి ఆర్థికంగా, హార్దికంగా ఎన్నో క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. నాకు ఈ విషయాలను

అప్పుడప్పుడూ రాసి ఇరివెంటి కృష్ణమూర్తిగారు తమ అశక్తతని తెలియబరిచేవారు. నేనొకమారు అననే అన్నాను. "మీకు వీలుకాకపోతే రాతప్రతి ఇవ్వండి. నేనే అచ్చువేసుకుంటాను" అని. కాని ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఒప్పుకోలేదు. "అలాంటి పరిస్థితే వస్తే నేనే సొంతంగా వేస్తాను. మీకు మాత్రం ఇవ్వను" అన్నారు. ఇరివెంటి వారికి నామీద ఎంత అభిమానమో చెప్పలేను. నేను చిన్నవాడినైనా నాకు వారి చూపిస్తుండిన గౌరవానికి నేను సిగ్గుపడిపోయే వాడిని.

ఇలా ఉండగా 1989లో ఒకసారి విద్యార్థులను పిలుచుకొని వారు మైసూరు వచ్చారు. అప్పుడే వారు "నేను ప్రొఫెసరు నయ్యాను" అని చెప్పి నాకు మహదానందం కలిగించారు. "ఇప్పుడు యువభారతి పరిస్థితులు చక్కబడ్డాయి. మరో నెలలోపు మీ పుస్తకం తప్పక ప్రచురిస్తాను" అన్నారు.

కాని నెలలోపలే వారు చనిపోయారు.

నా బాధను వర్ణించడానికి మాటలు చాలవు. నా పుస్తకం రాకపోతే పోయింది, ఒక ఆత్మీయుణ్ణి కోల్పోయామనే బాధ నన్ను తొలిచివేసింది. 'పరిశోధన పద్ధతులు" రాతప్రతి ఎక్కడుందో కూడా తెలీదు. ఇలాంటి పరిస్థితుల్లో తర్వాత 'యువభారతి' అధ్యక్షులయిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు నామీద ఎంతో అభిమానముంచి రాతప్రతిని వెలికితీసి ముద్రించారు. వారికీ నేనెంతో ఋణపడి ఉన్నాను. బెంగుళూరులో తెలుగు మహాసభలు జరుగుతుంటే కొన్ని ప్రతులు పట్టుకు వచ్చారు సుబ్రహ్మణ్యంగారు. ఇలా వచ్చింది నా 'పరిశోధన పద్ధతులు'.

ఈ సంవత్సరం కూడా చైతన్య కవిత, అనికేతన యధావిధిగా వచ్చాయి. చీనీ సాహిత్యాన్ని గురించి మేము ప్రచురించిన 'అనికేతన' పలువురి ప్రశంసలందుకుంది.

1990 నవంబరులో నేను రాజమండ్రి సాహిత్య పీఠానికి ఆచార్యునిగా వెళ్ళాను. అయినా కర్నాటక సాహిత్య అకాడెమీ వారు నన్ను వదలలేదు.

సంపాదకునిగా కొనసాగించారు. రాజమండ్రి నుంచే ప్రతి నెలకు, రెండు నెలలకు నేను సంపాదకుల సమావేశం కోసం బెంగుళూరు వచ్చేవాడిని.

ఇదే సంవత్సరం ఎం. చిదానందమూర్తి అనే పరిశోధకుడు, కన్నడ ఆచార్యుడు రాసిన 'కన్నడ సంస్కృతి వైభవం' అనే పుస్తకాన్ని స్నేహ ధర్మంగా అనువదించి ఇచ్చాను. దీని మూలప్రతి కన్నడంలో 35,000 కాపీలకు పైగా అమ్ముడు పోయింది. ఇదే మైసూరు మిత్ర ప్రింటర్స్‌లో నేను ముద్రించిన చివరి పుస్తకం. దీనితోబాటే ఇచ్చిన చైతన్య కవిత సంచికని కంపోజిటర్లు లేకపోవడంతో చాలా ఆలస్యం చేయవలసి వచ్చింది.

# 1991

నేను రాజమండ్రిలో ఉండడంవల్ల ముద్రణ కార్యాలేవీ సాగలేదు. చైతన్య కవిత 11 - 12 సంచికలు కలిపి వేగుంట మోహన ప్రసాద్, ఉత్పల చిత్రాలతో ముద్రించాము.

అతి కష్టంమీద మైసూరులోనే మిత్ర ప్రింటర్స్ అతను ముద్రించి ఇచ్చాడు. మళ్ళీ కొత్త ప్రెస్సులకోసం అన్వేషించాల్సి వచ్చింది. 'అనికేతన' ద్వారా యెహూది సాహిత్యం విశేష సంచికను తీసుకువచ్చాం.

# 1992

చైతన్య కవిత 13 - 14 సంచికలు కలిపి నగ్నముని, ముదివర్తి కొండమాచార్యుల చిత్రాలతో ముద్రించాము. విజయవాడలో విశ్వనాథ పావని శాస్త్రిగారికి ముద్రణ కార్యభారాన్ని అప్పగించడం జరిగింది.

పదేళ్ళ తర్వాత 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' మళ్ళీ ముద్రింపబడింది. మొదటి ముద్రణవల్ల నాకెంత తృప్తి కలిగిందో రెండవ

ముద్రణవల్ల అంత అసంతృప్తి మిగిలింది. పనిగట్టుకొని కొందరు అన్యాయాపరులైన అధికారులు పుస్తకం ముఖపత్రాన్ని అతిసామాన్యంగా ముద్రించడమే కాకండా, 'ఇది డి.లిట్. డిగ్రీ పొందిన గ్రంథం' అని ప్రచురించమని కోరుకున్నా ప్రచురించలేదు. ఇలాగైనా నా గ్రంథం విలువను తగ్గిద్దామని వారి ఉద్దేశం కాబోలు. నా పుస్తకం రావడానికై చిత్తశుద్ధితో శ్రమించిన మహనీయులకు మరోసారి మనసులోనే నమస్కరించుకున్నాను.

## 1993

రాజమండ్రిలో ఉండగా నాకు కలిగిన గొప్ప లాభం కొంతమంది ఆత్మీయ మిత్రులు లభించడం. కోస్తావాణి సంపాదకులు చింతల గోపాలరావు గారితో విడదీయరాని అనుబంధం ఏర్పడింది. నేను, చింతల, ఎండ్లూరి సుధాకర్ కలిసి కోస్తావాణి రూపురేఖలలో ఎన్నో మార్పులు తెచ్చాం. ప్రతిరోజూ 'చూపు' అనే పేరుతో ఒక ప్రాసక్రీడను రాయడం మొదలుపెట్టాను. నన్నయ మహాభారతాన్ని వచనంలో రాయడం మొదలుపెట్టాను. అది కోస్తావాణి చదువరులను ఆకర్షించింది. ఆది సభాపర్వాలు పూర్తి అయిన తర్వాత గోపాలరావుగారు దాన్ని పుస్తక రూపంలో తెచ్చారు. నా జీవితం మరో మలుపు తిరిగింది. గోపాలరావుగారూ ప్రకాశకుల జాబితాలో చేరారు. ఒక్క సంవత్సరంలో పది పదకొండు పుస్తకాలు ప్రచురించారు. ఇదొక అద్భుత విజయం. దానికి ఒక విధంగా నేను, చింతల, ఎండ్లూరి సుధాకర్ కలయికే కారణం. నన్నయ భారత ప్రచురణతో మళ్ళీ నాలో పుస్తక ప్రచరణవైపు ఉత్సాహం పెల్లుబికింది.

# భావన

నేను 1982లో ఒకసారి 1983లో మరోసారి అమెరికా వెళ్ళినపుడు కొన్ని వేల మైళ్ళు ప్రయాణం చేశాను. బస్సులోనే అమెరికాలో దాదాపు 30 రాష్ట్రాలకు పైగా చూశాను. అలా తిరుగుతున్నప్పుడే ఒక కల్పిత కథకూడా నా మనసులో సుళ్ళు తిరగసాగింది. యాత్రారచనను కథకు జోడించి ఒక 'టూరిస్ట్ నవల'గా రాస్తే ఎలా వుంటుంది అనిపించింది. మొదట కన్నడంలో నవలగా 1983లోనే రాశాను. దాన్ని ప్రచురిస్తామన్న పత్రిక మూలపడింది. ఆ పత్రిక పేరు 'సొగసు'! సుందరంగా నాలుగు నెలలు వచ్చి ఆగిపోయింది. నా రాతప్రతి కూడా వారితోనే పోయింది. చిత్తుప్రతి, నా నోట్సు మాత్రం మిగిలాయి.

మళ్ళీ 1993లో పదేళ్ళ తర్వాత నా భావాల్ని తిరుగదోడుకున్నాను. అదే 'భావన' నవలగా రూపుదిద్దుకుంది. ఆత్మీయులు చింతల గోపాలరావుగారే దానిని ముద్రించారు. రాజమండ్రిలో ఆవిష్కరణ కూడా జరిపారు. ఇలా నా సొంత నవల ఇన్నాళ్ళకు వెలుగుచూసింది.

నాకు మిత్రులనుంచి, సాహిత్యాభిమానుల నుంచి ఎన్నో ఉత్తరాలు వచ్చాయి. సహృదయులు, శ్రేయోభిలాషులు డా. అవంత్స సోమసుందర్ గారు ఉత్తరం రాశారు. (19 - 2 - 94)

"మీ నవల భావన యిప్పుడే చదివేసి ముగించాను. దాదాపు ఒక్కగుక్కలో - నిమిషమైనా పఠనంనుంచి విరహంభరించలేని ఉత్సుకతతో చదివేశాక నైరాశ్యంలోంచి ఆశోదయం - శుభోదర్కంగా ముగించడం గొప్ప రిలీఫ్! మీకు కథ చెప్పడం తెలుసు. I started your book with a great prejudice against your faculty of novel writing. But I could excuse myself for my under estimate. మీరు గొప్పగా నడిపారు కథని. అనవసరంగా భారం చేసే సన్నివేశాలు గాని పాత్రలు గాని లేకుండా, బరువైన సిట్యుయేషనును తేలిక పరుస్తూ సాగే పాత్రల

తోరణాలల్లుతూ, ప్రాదేశిక సౌందర్యా స్వాదనకు వ్యతిరేకంగా మనస్సుల్లో గూడకట్టుకున్న విషాదానుభవాల గొలుసుకట్టు వేదిస్తుండగా - నాటకీయంగా తారసపడ్డ రెండు పాత్రలు దాదాపు మూడు రోజుల్లో అత్యంత సన్నిహితులై - ఒకరికోసం ఒకరు ఎప్పుడో సృష్టింపబడి, కాలమూ దూరమూ వేరు చేయగా అన్వేషిస్తూ అన్వేషిస్తూ చివరికి ఆర్లాండో బస్సు స్టేషనులో కల్సుకోవడం - తదాదిగా సన్నిహితులు కావడం మేఘనాథ్ లాంటి వ్యాఘ్రేశ్వరుల నుంచి ఆ హరిణాన్ని రక్షించుకోగలగడం ఒక వినూత్న సమాజానికీ, ఆధునిక జీవన ధర్మానికీ ప్రతీకగా సాగింది. మీ నవల - లేదా పెద్ద కథ - అత్యంత మోదావహంగా, ఆనంద ప్రదంగా - ఇంకేం రాయను ?''

# జానపద సాహిత్య స్వరూపం

1976లో నేను ప్రచురించిన 'జానపద సాహిత్య స్వరూపం' మళ్ళీ ఇన్నేళ్ళ తర్వాత పునర్ముద్రితమైంది. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు సౌజన్యంతో ముద్రించారు.

ఎంతో తృప్తిగా, భవిష్యత్తును గురించిన మహదాశయంతో 1994లో అడుగు పెట్టాను. ఇరవై అయిదేళ్ళ నుంచి చేపట్టిన రచనా వ్యాసంగం నాకు జీవనోపాధి కాక పోయినా జీవితానికి ఒక మార్గాన్ని నిర్దేశించింది. ఈ పాతికేళ్ళలో ఏ ఒక్క రోజుకూడా ఏదో ఒకటి రాయకుండా చదవకుండా నేను వ్యర్థంగా గడపలేదు. నా బాధల్లో, వ్యధల్లో, మనస్తాపంలో రచనలే నన్ను ఆదుకున్నాయి. 'రచనాస్వాదనం' నాకు అమృత ప్రాయమయింది.

ఈ పాతికేళ్ళ జ్ఞాపకాలవల్ల ఎంతోమంది మిత్రుల, సహృదయుల, శ్రేయోభిలాషుల సహకారాన్ని, ప్రోత్సాహాన్ని స్మరించుకొనే అవకాశం కలిగిందన్నదే నా ఆనందం. ఈ జీవితానికిదే ఆనందం.

# చింతల పద్మావతి హోమ్ లైబ్రరీ

76 - 5 - 16, గాంధీపురం - 2,
రాజమండ్రి - 533 103. ఫోన్ : 61141

| | | | |
|---|---|---|---|
| 1. రచనాస్వాదనం | | ఆర్వీయస్ సుందరం | 20/- |
| 2. నన్నయ భారతం | 5518/సితి 200/537 | ఆర్వీయస్ సుందరం | 46/- |
| 3. భావన | 16155/సాతె 800/10789 | ఆర్వీయస్ సుందరం | 30/- |
| 4. ఇంటింట మంచి (మిలిటరీ) వంట (నాన్ వెజిటేరియన్) | 15589/సాతె 600/355 | సి. పద్మావతి | 30/- |
| 5. కిచెన్ పనోరమ | 15948/సాతె 600/369 | సి. పద్మావతి | 30/- |
| 6. మిరకిల్స్ విత్ నాన్‌వెజ్ | 15949/సాతె 600/370 | సి. పద్మావతి | 30/- |
| 7. నాన్‌వెజ్ డిలైట్ | 16208/సాతె 600/391 | సి. పద్మావతి | 30/- |
| 8. తెలుగువారి ముగ్గులు | 15024/సాతె 300/798 | సి. పద్మావతి | 15/- |
| 9. ఇంటింట మంచివంట (వెజిటేరియన్) పార్ట్ 1 | 15373/సాతె 600/336 | సి. పద్మావతి | 30/- |
| 10. " పార్ట్ 2 | 15374/సాతె 600/337 | సి. పద్మావతి | 30/- |
| 11. " పార్ట్ 3 | 15375/సాతె 600/338 | సి. పద్మావతి | 30/- |
| 12. చింగోరా గళం | | చింతల గోపాలరావు | 20/- |